

శ్రీ ఉమర్ అలీషా కవిగారు



అక్బర్ బీబీగారు

# శ్రీ ఉమర్ అలీషా కవిగారి జీవిత సంగ్రహము

శ్రీ ఉమర్ అలీషా కవిగారు పీఠికాపురమున క్రీ. శ. 1885 వ సం॥ లో జన్మించిరి. వీరి తండ్రిగారు మహర్షి మొహియుద్దీన్ బాషా గురువర్యులు. వీరి జనని చాన్బియాంబ.

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు, అధ్యాత్మిక విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాపారంగతులు. వీరి కుటుంబము పూర్వమునుండియు భాషాపాండిత్యమునకు, ఆధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతిగాంచినది. శ్రీ కవిగారు చిన్ననాడే సంస్కృతాంధ్రములు విశేషముగా నభ్యసించిరి. తదుపరి అరబ్బీ, పారశీ కాంగ్లభాషలు నేర్చిరి. వీరు ఆంగ్లమున వ్రాయుట, మాట్లాడుట యెఱుంగుదురు. కాని ఆంగ్ల పద్య కావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవేశము లేదు. వీరు సహజ కవులు. వీరి 14 వ వర్షమున తెనుగున ధారాళముగా కవిత్వముం జెప్పిరి. వీరి 18 వ యేట 'మణిమాల' యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలె నున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి. వీరి కనేకచోట్ల ఉద్యోగము లిచ్చెదమని ఆహ్వానించినను వాటి కంగీకరింపక భాషాసేవ దేశసేవ జేయుచు తమ జీవితమును గడిపిరి. వీరు 1934 వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి. ఆ పదవి వీరి మరణమువరకు నుండెను.

వీరికి International Academy of America వారు 1936 సంవత్సరమున Doctor of Literature బిరుద మొసగిరి. శ్రీ కవిగారు వంశపారంపర్యముగా వచ్చుచున్న ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు ఆచార్యులై పదహారువేల జనమును శిష్యులుగా నొనర్చిరి.

వీరి యోగిక జ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభాసభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుద మొసంగిరి. వీరి సతీమణి అక్బరు బీబీగారు వీరితో ఢిల్లీనగరము వెళ్ళి ది 5–1–45 తేదిని దివి నలంకరించిరి. ఆదినమున ఢిల్లీ శాసనసభ మూయబడెను. వీరు గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమారులు యిద్దరు కుమార్తెలు పెక్కురు పౌత్రపౌత్రిక లుండిరి.

శ్రీ కవిగారి జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయబడుచున్నది. వీరు రచించిన సూఫీ వేదాంతగ్రంథమందు వీరి జీవితము సంగ్రహముగా నిట్లు వ్రాసిరి.

## —♦ స్వీ య ము ♦—

క. ఆమొహియుద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నామహితాగమ హేత వి
ద్యామత "ఉమ్రాలిషా" మహాకవి నేనున్.

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్యప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసినాఁడను కల్పనాసక్త మతి పది
నాటకంబులను కర్ణాటఫక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలు పది నవ నవల లనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

తే. రసము పొంపొర నవధానక్రమములందు
ఆశువులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమ లెక్క
యువని "ఉమ్రాలిషాకవి" యనఁగ నేను.

ఉ. రాజులఁ జూచితిన్ సుకవిరాజుల నోర్చితిఁ జేరవ్రాయ రా
రాజుల నోలగంబుల విరాజితపండిత సత్కవీంద్ర వి
భ్రాజిత హాలపీఠిమద పట్టములందితి యూనివర్సిటిన్
తేజముమీఱ సభ్యుఁడయితిన్ మతబోధకుఁడైతిఁ గ్రమ్మఱన్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వరసైక చారు వి
న్యాసములున్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను "ఉమ్రలిషా" కవీంద్రుఁడన్.

ఉ. వేలు రచించి విద్యలను బెట్టి గడించితి పారితోషికా
ద్యాళిని వేయి... ట పదియార్డ్లను సింహతలాటముల్ మహా
ఖిలక సత్క[illegible]కనక [illegible]శతముల్ జయభేరి వ్రాయ హిం
తా[illegible] వనీ[illegible]టత్క[illegible]కవి తండము లేమిటి లెక్క మాకదన్.

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గము నెక్కి మునిని చక్కాడియాడి ;
బోధించితిని జ్ఞానసాధనక్రమములు
చెవినిల్లుగాఁ జేసి చెప్పిచెప్పి ;
సవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి ;
చూపించితిని రాజ్యలోపంబు నాంగ్ల ప్ర
భుత్వంబు ముంగర మోపి మోపి,

తే. ఇప్పుడప్పుడె నలుబదియేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాఁటికైన
శాంతి గలుగదు నీ కశాధ్వాంతమందు
జీవితము తెన్ను సుడిబోవు నావబోలు.

మ. వను నీజ్ఞానమహాసభాసదులు నానందాన నర్తించి 'ఆ
దిని మీపూర్వపితామహుల్ గురువులై దివ్యత్వమేపారఁగా
ఘనవిజ్ఞానకళాప్రవృత్తి ప్రజహృత్కాంతారముల్ నింపి రా
మని మీ రాకృతి బోధసేయఁదగు 'ఉమ్రాలీష' భాషాగతిన్.'

మ. అని నెయ్యంబునఁ గోరఁగా విని మహాహర్షంబు సంధిల్ల నా
వని యా జ్ఞానమహాసభాకథన మత్యంతంబు కష్టంబు మే
దిని సంసారనిమగ్నమానసులు నర్తింపంగ సాధ్యంబు గా
దని యున్నంత నెఱుంగసేతునని నే నారంభమున్ జేసితిన్.

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వపదంబుఁ జెంది నేఁ
గోరఁగ జ్ఞాన సభ్యులు నకుంఠితదీక్ష జగంబు మెచ్చఁగా
ఘోరతప స్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబుఁ దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండు జూచితే.

చ. కవిత నెఱుంగనట్టి పృథు కాలము వ్రాసితి పుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటము రాదు నుపన్యసించు నా
దినముల విద్యతోఁ గలని తృప్తి ఘటించెడు వాని నిప్పుడో
అవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమిచెప్పుదున్.

శా. ఎన్నో బాధలు బొందుచుండు [illegible]
పున్నెంపుంగని [illegible]
ర్థి నిర్నిద్రింపగ బోయిన [illegible] సం
ఛన్నాస్మన్నినిషిద్ధజీవిత [illegible]

సీ. ఏమాట చెప్పిన నెపుడాడగా లేదు
పరమసాధ్వీత్వంబు [illegible]
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు [illegible] నిలుక
కలిమిలేములను నొక్కటిగానె గణియించె
సత్యైక[illegible]
ఏపురు కొడుకుల నిల్తరు కూతుల
[illegible] సేవించు [illegible]

తే. ప్రతిదినంబు చదువు [illegible]రామాయణా
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్ర
రాంబ దివిజులు నీరాజనంబులిడఁగ.

చం. పరమపవిత్ర యీ తెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డికిబారెడు ప్రేమమూర్తి సుం
దర సముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరుసెద నగ్ర్బరాంబ కడు ప్రార్థనసేయుచు నెల్లవేళలన్.

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లిలో బ్రిటిషుసామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
ఫుల్లాబ్జానన 'అగ్ర్బరాంబిక' భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లన్ విచ్చిన కుందఁబోలె వెస నే జేరాడుచున్నా నిటన్.

చం. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచుఁ గన్నులనీరు కాల్వలై
చెదరఁగ నిమ్నలోకములఁ జేరుటకంటె సమాధితోంటి నీ
సదనము జేరు మార్గము విచారణజేయుట లెస్స యైహి కా
స్పద విభవానుషంగభవబంధము వాసిన నిన్ను జూడఁగన్.

శ్రీ కవిగారు యిస్లాం మతస్థులు. వీరి మాతృభాష ఉర్దూ. ఆంధ్రభాష మాతృభాషగా కానివారు తెలుగున సరసకవిత్వముఁ జెప్పినవారు ఈ కవిగా రొక్కరే. వీరు రచియించిన మహాభారత కౌరవరంగ మను నాటకమున —

" నాటకముల్ ప్రబంధము లనంతముగా రచియించి వాణి కా
వ్యాటవి భావవీథుల విహార మొనర్చ జయధ్వజంబు వా
గ్వాటిని నిల్పినట్టి జనవిశ్రుతు ఉం రలీషా కవీంద్రుడున్... "

అని వ్రాసిరి.

వీరు రచించిన గ్రంథము లేబదివర కున్నవి. శ్రీ కవిగారు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమగోదావరిజిల్లా) వెళ్ళి అచ్చట ది 23 జనవరి 1945 వ నాటి సాయంత్రము 5 గంటలకు దివి నలంకరించిరి. వీరి భౌతికదేహమును పిఠాపురముఁ దెచ్చి 24 వ తేదీ సాయంత్రము రైలుస్టేషను వద్ద నున్న వారి యారామములో సమాధి చేసిరి.

---

# పీఠిక

శ్రీ ఉమర్ అలీషా కవిగారి సతీమణి అమ్మీర్ బీబీగారు ఒక మహా పతివ్రత చరిత్ర వ్రాయుమని కవిగారిని కోరగా, వారు 'అనసూయాదేవి' చరిత్రను నాటకముగా 1918 వ సంవత్సరమున వ్రాసి ముగించిరి. శ్రీ కవిగారు ఆధ్యాత్మిక విజ్ఞాన మహాసభ ( జ్ఞానసభ ) కు ఆచార్యులై తత్వము ప్రబోధించుచుండిరి. వారి శిష్యులలో పెక్కుర జ్ఞానసభాసభ్యులకై ఒక నాటకము వ్రాయుమని కోరగా 'కళ' నాటకము 1932 వ సంవత్సరమున వ్రాసిరి. ఇది శ్రీ కవిగారు వ్రాసిన నాటకములలో ఆఖరిది. పెక్కు ఇతర గ్రంథములతోపాటు ఈ నాటకములకు కూడా వారి జీవిత కాలమున అచ్చుపడు భాగ్యము లేకపోయినది. 'కళ' నాటకము 1941 వ సంవత్సరమున ఢిల్లీ ఆంధ్ర సంఘమువారు Sir A. P. పాత్రోగారి ఆధ్వర్యమున ఢిల్లీలో ప్రదర్శించిరి. ఇందు పాటలు ప్రత్యేకముగా వ్రాయబడినను సందర్భానుసారముగా వాటిని చేర్చి ప్రకటించినాము.

అనసూయాదేవి, కళ, ఈ రెండు నాటకములు ఒకే సంపుటిగా ప్రకటించినాము. ఈ గ్రంథముల ముద్రణకై ఈ దిగువ పేర్కొనిన జ్ఞాన సభాసభ్యులు ధనసహాయము చేసిరి.

శ్రీమతి అల్లూరి సత్తెయ్యమ్మగారు

శ్రీ తమిరి నారాయణమూర్తిగారు

శ్రీమతి కపిలవాయి రమణమ్మగారు, వారికుటుంబము.

శ్రీమతి ఘూడావఝ్ఝుల వీరభద్రమ్మగారు

శ్రీ ఈవన వీరాస్వామిగారు

వీ రెల్లరకు మా కృతజ్ఞతాభివందనములు.

ఈగ్రంథ ప్రచురణయందు తోడ్పడిన శ్రీ కవిగారి బాల్య స్నేహితులగు కవిరాజహంస శ్రీ వోలేటి పార్వతీశ్వర కవిగారికి మా కృతజ్ఞతా పూర్వకము లగు వందనములు.

శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలాధిపతు లగు శ్రీ అద్దేపల్లి నాగేశ్వర రావుగారు మిక్కిలి శ్రద్ధాభక్తులతో ఈ గ్రంథములు ముద్రించి యిచ్చిరి. వీరికిని మా అభివందనములు.

పిఠాపురము<br>
19 — 6 — 1951

మదీన్ కబీర్ షా<br>
వారణాసి సత్యనారాయణ శాస్త్రి

కార్యదర్శులు<br>
శ్రీ ఉమర్ అలీషా కవి<br>
గ్రంథ ప్రచురణ సంఘము.

# ఇందు వచ్చు పాత్రలు

## పురుషులు

1. అత్రి
2. బ్రహ్మ
3. విష్ణు
4. మహేశ్వరుడు
5. నారదుడు
6. భైరవుడు
7. విటుడు
8. శిష్యులు

## స్త్రీలు

1. అనసూయ
2. గంగ
3. పద్మిని
4. లక్ష్మి
5. సరస్వతి
6. పార్వతి
7. విలాసిని
8. నాట్యాంగనలు

---

అద్వితీయ పరబ్రహ్మ మద్ధిగాగ
అందు మొదటితరంగమై యలరి వెలయు
నా మహాత్ముడుస్వామి నే నాత్మయందు
దలతు నైహికాముష్మిక ఫలములకును



భక్తి ఆ షైలలీ గురువరుని దలచి
శ్రీ మొహియదీన్‌బాషా మహామహుండు
నుతచరిత చాన్బియాంబ నా పితరులగుట
వారి పదముల కర్పింతు వందనములు.

# అనసూయాదేవి



## నాంది

చం. ఎవనివిశాలరూప మగు ♦ వేని నజాండమునిఁపి కాలమై
కవి కవితల్ రచించుటకుఁ ♦ గాని యతీంద్రియమ్మై రసాత్మక
ప్రవిమల ప్రేమసాగర ర ♦ వంగ సుధా సముపాసితంబునై
తవులునో, వాని తేజము స ♦ తంబిడుఁగాప్రత మీకభీష్టముల్.

సూత్రధారుఁడు — (ప్రవేశించి) నటీ యిటు రమ్ము.

నటి — (ప్రవేశించి) నాథా! ఏమి సెలవు.

సూత్ర — ఈదినమున మనమేదేని యొకమహానాటకము ప్రదర్శింప వలయును.

నటి — అందుకేనా యీ మహాజనము వచ్చి నిరీక్షించుచున్నారు!— కాని —

ఉ. నాటకముల్ కవీశ్వరు ల ♦ నంతముగా రచియించినారు నా
నాటికి వానిరమ్యతయు ♦ నాదరణంబును జారిపోయె నే
నాటక మాడినన్ జనులు ♦ నవ్వుదురో యను వన్నె తెక్క; స
య్యాటలు నాట్యరంగముల ♦ నాఁచికొనెన్ మఱి చెప్పనేటికిన్.

సూత్ర — అగు నగు నది కాలపరివర్తనము. కాని,

తే. గీ. బెళుకురాళ్ళున్న రత్నాల ♦ వెలలు పోవు
కులట లున్నఁ బతివ్రతా ♦ కులము పోదు
దొరువులున్నఁ బుష్కరిణుల ♦ పరువుపోదు
ప్రహసనము లున్న నాటక ♦ ప్రతిభపోదు.

నటి — ఇవ్వి డేనాటక మూడి యీ మహాజనుల రంజింపఁ జేయఁ వలయును?

సూత్ర — తే. గీ. పాపములఁ బాపఁగల పతి ♦ వ్రతలకథలు
సుధలుగురియఁ బ్రదర్శించి ♦ చూపి రూప
కప్రక్లృప్తతఁ నిలువు మో ♦ కమలనయన
ప్రహసనంబుల వంచింప ♦ వలెనె వేరె?

నటి — అట్టిరూపక మేమున్నది?

సూత్ర — లేక యేమి? వింటివిగదా!

ఉ. అత్రి మహాతపోమహితుఁ ♦ డై యనసూయఁ బతివ్రతాలసత్
గాత్రినిఁ గూడియుండఁ ♦ ద్రిజగంబుల పాలకులౌ త్రిమూర్తులన్
బుత్రులఁ జేసి యామె తన ♦ పూతసతీత్వముచాటు నట్టి చా
రిత్రము నాటకంబు ఉమ ♦ రే యలిపాకవి వ్రాసె నెచ్చెలీ.

నటి — మహాభాగ్యము.

# ప్రథమాంకము

ంంంOంంం

రంగము — అత్ర్యాశ్రమము

(అనసూయ చెలికత్తెలతోఁ బ్రవేశించి యుండును.)

అన — చెలులారా! ఈవన మెంత మనోహరముగ నున్నదో చూచితిరా!

సీ. పృథువారిపూర పూ ♦ రిత పద్మినీ సము
జ్జ్వల సరోవరము లా ♦ పంకఁజూడు
లలిత సస్యశ్యామ ♦ లంబై ప్రసూన సం
ఛాదితంబైన యా ♦ చెట్లఁజూడు
నానావిహంగ వి ♦ తాన మంజుల కల
స్వన సుధా ధామ మా ♦ వైపుఁజూడు
వివిధమృగార్భక ♦ వితతి మేపుచుఁబోవు
జంతుసంతాన మా ♦ పొంతఁజూడు

తే. గీ. ఆలమందలు బఱ్ఱియ ♦ లవిగో చూడు
అడవినెమ్మలు కోయిల ♦ లవిగో చూడు
అబ్జములఁ దుమ్మెదలరొద ♦ లవిగో చూడు
హాయి నిడు గంధవాహంబు ♦ లవిగో చూడు.

చెలి — చెలీ! అనసూయా! నీవును, త్రిలోకపూజ్యుఁడైన నీభర్త అత్రియును నెందున్న నాప్రదేశము పవిత్రమును, రమణీయమును గాక మరెట్లుండును?

తే. గీ. పృథుతపోధనుఁ డత్రి ప ♦ విత్రచరిత
నీవును సతీమతల్లివై ♦ యొసఁగె దమ్మ

మీర లుండుచోటును బచ్చ ♦ తోరణములు
నిత్యకళ్యాణములకును ♦ నెలవు గాదె!

అన — ఇవి మీ ప్రియవచనములు.

చెలి — అనసూయా! మన మాశాపారతీరమున, ఆపొన్నగున్నల మాటున, ఆ లతావితానములచెంతకుఁ బోయి హాయిగా పాటలు పాడుకొందము రమ్ము.

అన — నడువుఁడు.

చెలి — ఏలా! ఇచ్చట లేని యంద మచ్చటఁ గలదా? అంతదవ్వు పోయి వనశకుంతములతో మన అనసూయ యేమైన వియ్యము లంద వలసియున్నదా?

అన — (తనలో) నాకు బిడ్డలు లేరని యీ చెలికత్తె నన్నెత్తిపొడుచు చున్నది. అగు నది నిజము.

చెలి — అది గాదు. ఇది మనోజ్ఞమైన వసంతకాలము. మానవ జీవితములో నిట్టిపవిత్రసమయము లెన్నో అన్నప్పుడు రానేరవు. కావున మనమందర మాప్రదేశమునఁ గూర్చుండి హాయిగా పాటలు పాడుకొని యానందింతము; రండు.

అన — ఆనందము ముందు హృదయములో నుండవలయును. లేకున్న నీ ప్రకృతిసౌందర్యము లెన్ని యున్న నేమి ప్రయోజనము.

చెలి — అది గాదు. ఈహృదయ మెటు మరలించిన నట్లు మారు నను తాత్త్వికుల దృక్పథ మనృతము గాదు.

అన — అగును గాని, అట్టివినోదములు వెలిబుచ్చుకాలము మనకు చిన్ననాఁడే కూకటివేణితో సాగి కాలగర్భమునఁ గలసి యంతరించి పోయినది. ఇఁక మన కాయానందము స్వప్నప్రాయము.

చెలి — కావచ్చును. కాని, యిది యొకయానందము.

అన — అగును. కాలనాథుఁడు వయస్సను కుంచెతో మనశరీర

ఫలకమునం దెన్నెన్ని మాధుర్యములు, ఎన్నెన్ని రంగులు, ఎన్నెన్ని కళలు దిద్ది యౌవనమను దివ్యత్వము ప్రసాదించినాఁడు! కాని యిదియును మార్చివేయును.

చెలి — నిన్ను మార్చినాఁడేమో! నను మార్చలేదు. నేను చిన్ననాఁడున్న పూవపిందెవలె నేఁటికి నట్లాగే యున్నాను.

అన — అట్లనఁ జెల్లదు. చూడుము! నిన్నటికోరకము నేఁడు లతాంతములు విరిసి సౌరభముల వెదజల్లుచున్నది.

చెలి — అగును. నీవీవనములోఁ బ్రవేశించునప్పు డున్న యానంద మిప్పుడు లేదు.

అన — (స్వ) ఈమె నామనోగతము నింత నెట్లు గ్రహించినది?

చెలి — ఈయనసూయ సంతతి లేదని లోలోన విచారించుచున్నది. సరే. (ప్ర) అనసూయా! నీవు వీణవాయించుము. మేము నాట్యము చేసి యీవసంతుని నలరించెదము. (అని నాట్యముసేయుచు)

తే. గీ. బ్రతికినన్నాళ్ళు హాయిగాఁ ♦ బాట లాట
లందుఁ గాలంబు గడిపి దే ♦ హంబు విడిచి
పోవుటే లెస్స; లేమి ని ♦ ర్లోప కేడ్చి
బెంగలను గ్రుంగి క్రుంగి జీ ♦ వింపరాదు.

2 చెలి — అగు నావంకఁ జూడుము.

తే. గీ. తాటిచెట్టును జుట్టి పా ♦ దపము నిండు
మైత్రిఁ గౌఁగిలించినది; యా ♦ మాడ్కి మగువ
ప్రియునిఁ దమిఁగూడి యింత జీ ♦ వితముతోడ
కులుకుచుండును కలిమిలే ♦ముల సహించి.

1 చెలి — అందఱికన్న నాఁడుహాంద్రదే నిషిద్ధజీవనమని తోఁచుచున్నది.

అన — అట్లనఁ జెల్లదు. సతికిఁ బతితోడిదే లోకము.

చెలి — అటువంటి నారికి లోకమే లేదు.

తే. గీ. జామిపండ్లను గొఱుకుచు ♦ రామచిలుక;
మావిచివురుల మెసవి జొం ♦ పములదాగు
కోకిలంబును; సుమములఁ ♦ గొఱకు నెమకు
భ్రమరమును; వసంతవీధి మా ♦ గ్గాశ్రమంబు
దీర్చుకొని యోగి మదనుని ♦ గూర్చి పాడి
విశ్వమోహనరాగంబు ♦ వెలువరించి
విశ్వమంతయుఁ గరగించి ♦ వినుతిఁ గాంచు
అట్టియానంద మున్నదే ♦ యతివలకును?

అన — అది యానంద మని యెట్లుచెప్పఁ గలము. అందుఁగూడ బానిసత్వ మున్నది.

తే. గీ. కేకి పురి విప్పి యాడుచు ♦ నాకసమున
మేఘమాలికకై చూడ్కి ♦ మొలపు నదిగో
చాతకము పయోధరముల ♦ సడి యెఱింగి
ఱెక్క లల్లార్చి వానకై ♦ మ్రొక్కుఁ; గంటె!
సరసిలోపల వికసించు ♦ సారసంబు
సౌరభంబుల విలిచి ♦ భాస్కరుని బిలుచు
ఎవరు హృదయేశునెదను సే ♦ వింపకుంద్రు?

అత్రి — (ప్రవేశించి) అదిగో అనసూయ చెలికత్తెలతో నిందు విహరించు చున్నది.

అన — (సమీపించి) నాథా! మీపాదపద్మములకు మీ దాసినగు నేను నమస్కరించుచున్నాను.

చెలి — స్వామీ! నమస్కారములు.

అత్రి — అనసూయా! నేను [illegible] నీకా మాటపాటల కంత రాయము కల్పింపలేదు గదా!

అన — లేదు.

సీ. వీణ వాయించిన ♦ గానంబు చేసిన
ప్రియ నీవు మనసార ♦ వినుటకొఱకె;
కథలు చెప్పిన, సుధా ♦ మధురోక్తి నెకసెకా-
మాడిన నీ వల ♦ రాఁకొఱకె;
తూఁగుటుయ్యెలలపైఁ ♦ దూఁగిన, విరిసరుల్
గ్రుచ్చిన మది నీవు ♦ మెచ్చుకొఱకె;
దాఁగుడుమూఁతలఁ ♦ దరులఁ గొమ్మచ్చులు
నాడ, నాతోడ నీ ♦ వాడుకొఱకె;

తే. గీ. అద్దమునఁ దోచు ప్రతిబింబ ♦ మట్లు సతము
నేను నీలోన లీనమై ♦ నిన్ను చూతు
నిన్ను నాలో లయ మొనర్చి ♦ నిన్ను చూతు
నీవె తక్క నాకేదిలే ♦ దీజగాన.

అత్రి — దేవీ! ప్రియురాలవైన నీశీల మతి పవిత్రమును, మహనీయము నై యున్నది.

అన — అది తమ దయావిశేషము (అని తలవంచును).

అత్రి — దేవీ! నీవు నేఁడేల ఖిన్నురాలవై యున్నావు?

సీ. పున్నమచంద్రుని ♦ బురుడించు మోమున
చిన్నని నవ్వువెన్నెల ♦ నినిచెదీవు
గంగాఝరీ సము ♦ త్తుంగ తరంగ సం
గతులతో నీ పాటఁ ♦ గలపెదీవు

అ న సూ యా దే వి

ఆణిముత్తెపుసరు ♦ లలరులదండల
తో నీమువద్ద్రె[illegible]ల్ ♦ తూచె దీవు
శారికా కీర పి ♦ కాళావనములతోడఁ
బలుకుల వియ్యంబుఁ ♦ గలపె దీవు
తే. గీ. స్వచ్ఛమగు కులశీల సం ♦ పదలఁ బొదలి
బమ్మ సానవెట్టిన పైఁడి ♦ బొమ్మ వీవు
సద్గుణంబులకును తావు ♦ సాధ్వివీవు
ఈవె అనసూయ! అనసూయ ♦ వే నిజంబు.

దేవీ! నీవగవునకుఁ గారణమేమి?

అన — నన్నీ చెలికత్తెలేమేమో యెకసెక్కెములు చేసినారు.

అత్రి — అది యేమి?

అన — నేనెంతో యానందముగా ఈవనమునఁ బ్రవేశించితిని.

అత్రి — సరే నీవెప్పుడు నానందదేవతవే కదా!

అన — అంత నాచెలికత్తెలు మాటలలోఁ బెట్టి "యీవనశకుంతములతో నీవేమైన వియ్యములందుటకువచ్చితివా!" అని నన్ను యన్యాపదేశముగా నాకు బిడ్డలు లేరని యెగతాళి చేసినారు.

ఉ. పిల్లలు వాకిటన్ మనల ♦ వేడుకఁ జూడఁగ నోచుకొంటినో
యుల్లము తల్లడిల్ల వ్యథ ♦ నొన్మ్రుఖనాదునో గొడ్డురాలనై
వల్లభ! యీఁడుపుట్టునకు ♦ భాగ్యము బిడ్డలుగారె ప్రాయ మె
న్నాళ్ళిటులుండు నీబ్రతుకు ♦ నన్ గతు లుండునె యెన్నియుండినన్.

అత్రి — దేవీ! నీవు చెప్పినది నిక్కము. నాకును, ఈచింతయే చిరకాలమునుండి హృదయము వేధించుచున్నది. కాని యీదుర్గతి నన్ను కదా బాధించును!

అన — అట్లందు రేల? నే నర్ధాంగిని గానా!

అత్రి — అర్ధాంగి పుణ్యము పంచుకొనుటకే కాని భర్తపాపము పంచుకొనుటకుఁ గాదు.

అన — పకే సంతానమహాపుణ్యము నన్నుఁగూడఁ దరింపఁ జేయును గదా!

అత్రి — ఆహా! సందేహమేమి; నీయట్టిపవిత్ర చరిత్ర లట్లేభావింతురు.

అన — నాథా! ఏమట్లందురు? ఆఁడుపుట్టువ పుట్టిన యేస్త్రీయైనను సుతులను బడయఁ గోరకుండునా!

అత్రి — అమాయకురాలా! అట్లు గడిదేరినవా రెందరు లేరు.

తే. గీ. సుతులఁ గని వారి పొంపును ♦ జూడలేక
చేతులారఁగఁ జంపి వే ♦ సినది గంగ
పాపభీతి యుండదు స్త్రీల ♦ కేపనైన
నిట్టి చేతురు స్వాతంత్ర్య ♦ మిచ్చిరేని.

కలి — (స్వ) ఆహా! అత్రీ! స్త్రీస్వాతంత్ర్య వాదులపై నెంతదెబ్బ కొట్టితివి! నా వితండ వాదసిద్ధాంత మను మృద్భాండము నీవాగ్దండ మున ఖం అని బ్రద్దలై పోయినది.

అత్రి — దేవీ అపత్యార్థమై మన మీశ్వరుని బ్రార్థింతము రమ్ము.

అన — చిత్తము. (హారతి వెలిఁగించి),

శా. ఆపద్బాంధవ దీనరక్షక త్రిలో ♦ కాధార సర్వాత్మకా
ఆపోరూప యనంత తేజ భవదీ ♦ యంబైన విజ్ఞానమే
రూపానన్ లభియించు మాకుఁగరుణా ♦ రూపుండవై చూపవే
కాపాడన్ వరమీయవే యిడుమలన్ ♦ గారింపవే యీశ్వరా.

అత్రి — దేవీ మనకు సంతతి కలుగుపట కిచ్చుటనేతపమాచరింతము.

# అనసూయాదేవి

రంగము — శ్మశానము

(హతభేతాళాది రాక్షస పిశాచముల మధ్యమున పాపదేవతతో గంగ ప్రవేశించి యుండును.)

పాప దేవత — హుం

గంగ — హతోస్మి (అని మూర్ఛిల్లి లేచి) హతవిధీ నీవిధాన మను ల్లంఘ్యము, అప్రతిహతము, అనన్య సామాన్యము. అలోకవిపరీతమైన నీచెయ్దము లగ్నికంటె, విషముకంటె, కంట కావృతమహాంధకార దుర్గంధ పంక సంకలితకాల కూపాంతరముకంటె, దుస్సహము, దుర్భరము, భయావహము. నేనింక నిలువలేను. నాయొడలు కంపించి పోవుచున్నది. ఉడికిపోవుచున్నది.

పాప — హుం

గంగ — హతోస్మి. అదే. అదే! పాపదేవత ఛాయారూపమున నావెన్నాడుచు పీడించుచున్నది. నన్ను పీల్చి పిప్పి చేయుచున్నది. జువ్విచెట్టు తాటిచెట్టును చుట్టి కబళించినట్టిపాపిని నానిలువెల్లఁగల్మషోపేతము గావించి యులయించు చున్నది. నేనింక భరింపలేను. ఆఁగలేను. నేల దొర్లిదొర్లి, కొండలెక్కి, బండలకుఁ దాకి, గోతులలోఁబడి నూతులలోనురికి చావక సమయక వేగి విసిగి భూమి చుట్టి, గతి గానక, మతి చెడి వెతలపాలై ప్రాణత్యాగము చేసికొన నెంచి సముద్రమునఁ గూలినను నాకది మోకాలిబంటియే యగుచున్నది. ఇంక నేనేమి చేయుదును? నాకెయ్యది తెఱవు? ఏది శరణ్యము? అయ్యో నాప్రాణములు కొట్టుకొనిపోవుచున్నవి.

మ. అమరత్వంబును, నాకలోకనిలయం ♦ బాచంద్ర తారార్కమా
  ర్గము, నానాకలుషాపహంబగు నదీ ♦ ప్రఖ్యాతియుం బోవు నిం
  క మహాకాల జటాచ్ఛటాభరణ గం ♦ గాదేవి యాజన్మసు
  స్య మహాపూతచరిత్ర యంచు నను స ♦ న్మానింపఁబో రెవ్వరున్.

పాప — హుం.

గంగ — ఓశ్మశానవాటికా! నావిచిత్రచరిత్రమేమని యడుగు చున్నావా! జలస్వరూపిణినైన నేను సురశాపోపహతనై భిన్ననై దివ్యత్వంబు విసర్జించి మానవ స్త్రీజన్మంబున నవతరించి భారతకులప్రసూతుం డగు శంతనుని జెట్టబట్టి కాంచినసుతుల నేడ్వురను "అబ్బా! చెప్పఁజాలను" ఆముద్దుబిడ్డల గొంతులు నులిమి,

ఉ. నిండిననీటిభాండముల ♦ నేలను మోదినరీతి బిడ్డలన్
జెండితిఁబాపినైతి నిజ ♦ శీలముబూడిదలోనఁ బోసి యీ
దండధరారిచేత యమ ♦ దండనపాలయితిన్ విముక్తి నా
కుండునె యీశ్వరుండు దయ ♦ నోమునెనన్నిఁక నన్నుఁజేసియున్.

పాప — హుం.

గంగ — హా! పాపము. తాపము. నేనింక జీవింపలేను. నాప్రాణములు మూర్ఛిల్లి పోవుచున్నవి.

శా. ఆసల్ వాసె, విశీర్ణమయ్యె తను వ ♦ త్యంతంబు జీవంబులుం
గాసిం జెందె శశంబు సింగవుగుహన్ ♦ బడ్డట్టు లీకాటిలో
వాసం బేర్పడె నీపిశాచములకున్ ♦ భక్షింపనా మాంసమున్
దోసిళ్ళన్ గొని త్రావ రక్తమిడుచుం ♦ దున్ నిత్య మర్ఘ్యంబుగన్.

పావ — హుం

గంగ — అమ్మా! అంత కన్నులెఱ్ఱఁజేసి నాపై నురుకఁజూచుట నీకుఁ జెల్లునా! అదిగో! పండ్లు కొఱుకుచున్నావు. వలదు. నీకిదే నమస్కరించుచున్నాను. పావదేవతా! పొమ్ము. నన్ను విడనాడి పొమ్ము.

పాప — హుం.

గంగ —

తే. నావిషాదకథావిధా ♦ నంబుఁ జెప్ప
లేను, వ్రాయఁగ లేను, నా ♦ తోన యీమ

హాగ్ని చల్లారవలయుఁ గా ♦ స్థానుమంగ
మైన ధూమంబు శిఖ లీన ♦ మైన పగిది.

పాప — హాసం.

గంగ — దుస్సహమైన యీపాపపిశాచహుంకారములచే నామేను ముక్కలైపోవుచున్నది; నేనింక సహింపలేను. ఒడలంతయు దహించి కొనిపోవుచున్నది. ఆహా తాపము! తాపము! నాకింక నేదిశరణ్యము! ఏదికర్తవ్యము! ఓదుర్గా, ఓజగన్మాతా!

ఉ॥ భీతను పాపదేవతల ♦ వేదనకున్ విలపించు వేల్పుసం
జాతను, భూతలప్రణుత ♦ జాహ్నవిఁ బుణ్యనదీలలామ వి
ఖ్యాతను సాటిబోటిని గ ♦ దా ననుఁ గావఁగరాదె యోజగ
న్మాత! దయార్ద్రపూత! సుగ ♦ ణవ్రతసన్నుత దుర్గ మ్రొక్కెదన్.
(అని మూర్ఛిల్లును)

దుర్గ — (ప్రవేశించి)

తే. గీ. అఖిలకలుషంబు లుడుపు పు ♦ ణ్యాస్రవంతి
శివజటాజూటు మెక్కిన ♦ సిద్ధకన్య
గగనమార్గానఁ గన్న యీ ♦ గంగ పాప
భీతయై యున్న నెవరికి ♦ భీతి గాదు.

ఈమె కురుకులపితామహుండగు శంతనుని పెండ్లియాడి యాతని వలనఁ గన్న యేడ్వురుపుత్రులను గొంపోయి గంగలోఁ గలిపినది. ఆ యమానుషకృత్యమును జూచి నరసురయక్షరాక్షసాది జీవజాలంబులే కాక పంచభూతంబులు గూడ నేడ్చినవి. కాని, యీజగజంత కొంకింత యేని గనికర ముదయింపలేదు. ఈపాపాణప్రాయ శ్చిత్తము కావలసినదే. పాప మెప్పుడును ననుభవింపక తీరదు.

తే. గీ. గర్భముల దింపుకొను జార ♦ కామినులును
కన్నబిడ్డలఁ జంపెడు ♦ కఠినురాండ్రు
పొందు యమబాధలకు మఱి ♦ మందు లేదు
పాపమున కెల్లరును భయ ♦ పడఁగవలయు.

గంగా! మూర్ఛిల్లితివేల లెమ్ము.

గంగ — (లేచి) నమస్కరించి (స్వ) సామాన్యజనదుర్లభమైన ఈ దుర్గ తన యవ్యాజకృపాకటాక్షమున సాక్షాత్కరించినది. నేనింక ధన్యనయ్యెదను (ప్ర) దేవీ! పార్వతీ!

చం. నగము శరీర మిచ్చి తన ♦ సామిని గొల్చిన లోకమాత, రే
బవలు వెలుంగు మంగళ భ ♦ వాని, భవార్తజనంబు పాలికిన్
భగవతి, నీదుపాదములు ♦ పట్టినఁ గట్టిడి కాలపాశముల్
తెగు నని వేదముల్ వలుకు ♦ దీన ననాథను నన్నుఁ బ్రోవవే.

పాప — హుం.

గంగ — (భయమునఁ గంపించి) దేవీ! రక్షింపుము. రక్షింపుము.

దుర్గ — (స్వగతము)

ఉ. స్వైరవిహారలైన నెఱ ♦ జాణలు భర్తలఁగూడి యాత్మసం
సారము లెంతో దిద్దుకొని ♦ సంపదలన్ దులదూఁగజాల రే
పోరులా పెంచి ఖేదముల ♦ ముంచి కుటుంబము కాపురంబులో
నీరముపోసికొందు రతి ♦ నిందలపాలయిపోదు రావలన్.

(ప్రకాశముగ) గంగా! భగినీ! నీకివ్వు డేమి కావలయును.

గంగ — ఈపాపదేవతలనుండి నాకు విముక్తిఁ గావింపుము, తల్లీ నీకిదె నమస్కరించుచున్నాను.

దుర్గ — ఓ భూత భేతాళాది పిశాచ సమూహములారా! ఓ పాప దేవతలారా! మీరెల్లరు పటావంచలై తొలఁగిపొందు మీకిదే యాన!

భూతములు — హా! హా! హతోస్మి హతోస్మి పాహిమాం పాహి (అని పోవుదురు).

గంగ — ఆహా నేనింక చరితార్థనైతిని. ఈ శ్మశాన పిశాచము లన్నియు సూర్యరశ్మిచే మంచు తెర విడిపోయినట్లు మాయమై పోయినవి. నాపాపదేవత యీకాత్యాయినీ వరప్రసాదమున నేడు భస్మీభూతమైపోయి యుండవచ్చును.

పాప — హాలుం.

గంగ — హతోస్మి (అని దుర్గను కౌగలించుకొని) తల్లీ రక్షింపుము.

దుర్గ — గంగా! ఈదేవత నన్నుఁగూడ లక్ష్యపెట్టకున్నది.

గంగ — అయ్యో, ప్రణవస్వరూపిణివైన నిన్నే యీదేవత సరకుసేయకున్నదియా?

తే. గీ. పాపకారిని ఘోరశా ♦ పోపహతను
పాపపైశాచిక్రకూర ♦ పరితపాగ్ని
దగ్ధ నగు నాకుఁ గలదె క ♦ ర్తవ్య మింక
నాశ లన్నియుఁ దెగి యడు ♦ గంటిపోయె.

దుర్గ — గంగా, సోదరీ! నీవిట్లు వాపోవవలదు. దేవతల సమారాధించి ప్రశాంతచిత్తవు కమ్ము (అని అంతర్ధానమై పోవును).

గంగ — (చేతులు మోడ్చి)

తే. గీ. దీనురాల ననాథను ♦ దిక్కుమాలి
వేడుచుంటిని ముక్కోటి ♦ వేల్పులార
వేల్పుటిల్లాండ్రులార! నా ♦ వెతలఁ దీర్ప
రండు మ్రొక్కెద నిడెద నీ ♦ రాజనములు.

[తెరపడును]

---

# ద్వితీయాంకము

రంగము — కైలాసము

(బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు — సరస్వతి, లక్ష్మి, పార్వతులు — నారద వశిష్ఠులు ప్రవేశించి యుందురు.)

మహేశ్వ — నారదా! నీవు చెప్పిన అత్రి అనసూయల చరిత్రము మిగుల ప్రశంసనీయము.

విష్ణు — అగును.

ఉ. అత్రి మహాతపోమహితుఁ ♦ డైనను నాయనసూయ వానికిన్
క్షేత్రముగావునన్ సిరుల ♦ చేఁ దులదూఁగి యిహంబు స్వర్గమ
ట్లాత్రముదక్క సౌఖ్యముల ♦ హాయిగ వైదికకర్మ నిష్ఠుఁడై
చైత్రరథంబుఁ జేసె ముని ♦ సంతతికిన్ దనయిల్లు నిత్యమున్.

బ్రహ్మ — ప్రపంచమున నట్టిమహనీయులు లేకపోలేదు.

దౌవారికుఁడు — (ప్రవేశించి) దేవా! ద్వారమునొద్ద నొకయామె వచ్చి వేచియున్నది.

మహే — రమ్మని వచింపుము.

నర్మద — (ప్రవేశించి) దేవదేవులైన త్రిమూర్తులకును మహనీయులైన మహర్షులకును నమస్కారములు.

విష్ణు — నీపేరేమి?

నర్మ — నర్మద.

బ్రహ్మ — నీభర్త?

నర్మ — నేనవివాహితను.

మహే — తపస్వినీ!

మ. పడఁతుల్ పెండిలికానివారలకుఁ ♦ గైవల్యంబు సిద్ధింపదన్
నుడులాలింపవొ యొంటిమై నడవిలో ♦ సూరేం ద్రుపాసించినన్
బడయన్‌జాలరు మోక్షసంపదలు దాం ♦ పత్యంబునన్ గల్గు పె
క్కిఁడుమల్ ప్రాయికమైన దుఃఖముల నెం ♦ తే నొంది రాకుండినన్.

నర్మ — అయ్యో! నాకింకెయ్యది మార్గము.

వసిష్ఠుడు — తల్లీ! నీవు తిరిగి జగదభిముఖవై పోయి గృహస్థాశ్రమమును స్వీకరింపుము.

నర్మ — ఆ యిహాముత్రార్థఫలభోగమును నేనెట్లు స్వీకరింపఁగలను? అది వమనాన్నము గదా.

నార — అగును కాని స్త్రీలకు సన్యాసినీత్వము లేదు.

నర్మ — మాయామోహితమైన సంసారమహాంధకారమున బడి పడఁతులందరు చావవలసిన దేనా?

వసి — స్త్రీప్రకృతి భోజ్యము గాని, భోక్త గాదు.

నర్మ — సర్వక్రియానివృత్తి గలిగిన నేల జీవన్ముక్తి రానేరదు?

నార — స్త్రీలకు రాదు.

వసి — సాధ్విమై కైవల్యము చూరఁగొనవలయును.

నర్మ —

సీ. విషయేచ్ఛలను మున్గి ♦ విఱ్ఱవీగెడు ఘోర,
విశ్వసంసారంబు ♦ విడిచివిడిచి
ఎండవానల కాఁగి ♦ తిండితిప్పలుమాని
కష్టనిష్ఠురముల ♦ గడపిగడపి
సుఖదుఃఖముల రెంటి ♦ సౌఖ్యంబు వర్జించి
నిర్వికల్పసమాధి ♦ నిలిచినిలిచి
ఊర్ధ్వదృష్టిని గగ ♦ నోపరిభాగంబు
కైవల్యపదమును ♦ గాంచికాంచి

తే. గీ. మనసు నిర్గుణార్చనకును ♦ మలపిమలపి
భావమునఁ గల వాంఛలఁ ♦ బాపిబాపి
చేరి యాత్మజిజ్ఞాసను ♦ జేసిచేసి
కడనఁ జేసిన తపమెల్లఁ ♦ జెడిపో నొక్కొ?

వసి — నీవు పొరపడుచున్నావు.

మ. తపమన్నన్ వ్రతనిష్ఠలన్ సలిపి మం ♦ త్రధ్యానపూజావిధిన్
జపముల్ సేయుట గాదు గృహ్యామగు సం ♦ సారార్ణవంబీది యుం
దుపవాసంబునో భోగసంపదనో యే ♦ దోరీతిఁ గాలంబు బు
చ్చి పరాత్మున్ భజియించుటే తపము స ♦ చ్ఛీలంబు చింతింపఁగన్.

నర్మ — పరమపూజ్యులైన మీయాదేశమును నేను శిరసావహించి తిరిగి భూలోకాభిముఖినై పోవుచున్నాను. నాకింకేమి గతి!

మహే — అనఁగా?

నర్మ — సర్వజ్ఞులైన మీ రెఱుంగని దేమున్నది.

తే. గీ. తల్లి దండ్రి లేని ♦ తమ్ములు లేని యా
నాథ నయ్యు నాకు ♦ నాథుఁ డెట్లు
వచ్చు? సొమ్ము లియ్య ♦ వచ్చినవారికే
పెండ్లి గాని నాకుఁ ♦ బెండ్లి యగునె?

నార — నర్మదా! నీవన్నది నిజము.

బ్రహ్మ — సృష్టిలో మానవులు వధూవరులై ధర్మార్థకామముల యథావిధి నెరవేర్ప వలయును గాని, యీ శుల్కదురాచారము లేల పెంచిరో తెలియదు. ఇంతకన్న మహాపాప మేమున్నది.

విష్ణు — స్వార్థపరులకుఁ బాపభీతి లేదుగదా!

మహే — నర్మదా! వరశుల్కకన్యాశుల్కముల బలిమిని గ్రహించిన వార లెట్టి యమదండనకుఁ బాల్పడి నరకాగ్నిం గాలుచున్నారో

చూచితివా (అని వ్రేలిచే పాతాళము చీల్చి చూపించును).

నర్మ — దుస్సహము, దుస్సహము. ఘోరము. మహేశ్వరా! వారనుభవించుచున్న యమదండనముఁజూడఁ జాలకున్నాను. దుర్నిరీక్ష్యమైన యీదృశ్యము నాయెదుటనుండి తీసివేయుము.

నార — శంకరా! ఈనరక మీనర్మద కేల చూపెదవు? ఆ వర ళుల్కములు పట్టు పాపాత్ముల కగపఱుపుము.

విష్ణు — వారనుభవించుచునే యున్నారు.

మహే — నీవింక కైలాసము విడిచి వెడలుము. భూలోకమున నీకెవరు తొలుత నెదురయ్యెదరో వానిని బెండ్లియాడుము. నీకు ధన మక్కఱ లేదు.

నర్మ — మహాప్రసాదము.

తే. గీ. బాలభానునిఁ గబళింప ♦ వచ్చుఁ; జిన్న
బుట్టవలె మంచుకొండను ♦ మోయవచ్చు;
నూదిబెజ్జాన నేన్గులఁ ♦ జొనుపవచ్చుఁ
గాని యతి కష్ట మత్తింటి ♦ కాపురంబు.

(అని తిరోహిత యగుచున్నది)

తెరలో (మాంపాహి శంకరా మాంపాహి)

(అందఱును లేచి) యేమా యార్తనాదము!

విష్ణు — ఏమో తెలియదు.

బ్రహ్మ — నరకలోకము నుండి వినవచ్చుచున్నది.

విష్ణు — ఎవరో పాపాత్ములై యుండవచ్చును.

మహే — ఆ యార్తధ్వనులు చేయుచున్న దెవరో మా కెఱిఁగింపుడు.

గంగ — (తెరలో)

తే. గీ. శూలితలనెక్కి శివజటా ♦ జాలములను
మునుఁగుగాఁ దాల్చి దాగుదు ♦ మూతిలాడి

పలచి వలపించినట్టి యా ♦ లలన నేను
గంగ యనుదాన నరకాగ్నిఁ ♦ గాలుచుంటి.

దేవా! నన్ను నీ శ్రీపాదాలకు లాగికొనుము.

మహే — గంగా! నా త్రిశూలము నూతగాఁ జేసికొని నాయెదుటికి రమ్మా! నీ కేమియును భయములేదు. (అని త్రిశూలము వంపును; గంగ పైకివచ్చి) దేవాదిదేవులారా నమస్కారము. జగజ్జనకులైన మీరంద ఱొక్కసారి దర్శనమిచ్చి రిఁక నా పాపపంకము లడుగంటినవి. నేనింక ధన్యనయ్యెదను.

పాప — హుం.

గంగ — అయ్యో, యీ పాపదేవత కైలాసమునకు వచ్చినను నా వెం టాడించుట మానలేదు! ఏమి యీ వికృతాకారము, ఏమి ఆరక్తసిక్తాంగ కములతోడి భీభత్సరూపము. అయ్యో, ఎట్లు నాపైఁ బడఁ జూచు చున్నదో! ఎట్లు రూక్షారుణకిలోలలోచనములతో జడిపించు చున్నదో! ఆ ఛాయారూపమైన మహాపిశాచము ఆ ఘాతకిని అమూడు గాళ్ళ ముసలిముండ మండవంటి తలతో, గరికపోచలవంటి శిరోజ సూచికలతో వికారముగా త్రికాలములయం దొక్కనిముష మైన నన్నెడఁబాయక హుం హుమ్మని రోషభీషణ మహాట్టాట్టహాసముల జేసి నన్నుఁ బీడించుచునే యుండును. నాకింకేది కర్తవ్యము, ఏది శరణ్యము! ఓ మహాదేవ శంభో జగద్రక్షకా!

మ. గరళం బంగిటఁ బట్టినాఁడవు మహా ♦ కాలుండవై; శూలివై
పురసంహారము జేసినాఁడవు; మరున్ ♦ బూర్ణాహుతిన్ జేసినా
వరయన్ మూఁడవకన్ను విప్పి; చని రు ♦ ద్రాస్థాణువై దక్షున
ధ్వరవిధ్వంస మొనర్చినాఁడవు నినున్ ♦ వర్ణింపఁగా శక్యమే!

మహే — గంగా! నీకేమి కావలయును?

గంగ — శంకరమహాదేవా! నా వెంటాడుచున్న యీపాపదేవతను నీ త్రిశూల ధారచే వారించి నన్నుఁ జరితార్థను జేయుము.

పాప — హుం.

గంగ — అదిగో.

మహే — అదియేమి గంగా?

గంగ — మహాదేవా! చెప్పఁజాలను.

దుర్గ — ఈమె శంతను సమాగమంబున సుతసప్తకమును గాంచి శమనున కర్పించినది. ఆ పాతక మీరీతి నీమెను బాధించుచున్నది.

గంగ — అగును మహాదేవా! అగును.

పాప — హుం.

గంగ — అదిగో! ఎఱ్ఱగ నల్లగ కొఱ్ఱువలెఁ దలవిరియఁబోసికొని నోట నగ్నికణంబులు రాల భీకరాకారంబున వేయియేనుఁగులంత లావు, వెలగకాయయంత తలకాయ, చీపిరికన్నులు, మేఘగర్జనలవంటి యరపులు, మిక్కిలి మలీమసమైన రూపముతో వచ్చుచున్న ఆమహాకాళరాత్రి, ఆప్రళయకాల పుష్కలావర్తము, నేనుచూడను; ఆ బాధపడలేను! నన్నది కొఱికి నాకడుపులో నిద్రించుచున్నది. హా! యమబాధ! బాధ! (అని మూర్ఛిల్లును)

మహే — గంగా! నీవేల భయకంపిత వయ్యెదవు? నాత్రిశూలముచే నీపాపదేవతను నఱుమాడెద (అని ప్రయోగించును, పెద్దఅగ్గిమంటలు లేచును). గంగా! నీకు శాంతి చేకూరినదా! చూడు నీవెన్నాడుదేవత దగ్ధమైపోయినది.

గంగ — (లేచి) ఏది?

పాప — హుం.

గంగ — దేవా! అక్కడే యున్నది.

విష్ణు — అగును.

మహే — ఇది మిగుల చిత్రముగ నున్నదే!

శా. అగ్నిన్ నీరము లార్పినన్, దపనుఁ డా ♦ యాకాశరంగస్థలిన్
భగ్నంబై ప్రళయంబు వచ్చినను, నీ ♦ బ్రహ్మాండముల్ విచ్చియు
ద్విగ్నఁబుల్ దిగిభంబు లన్నియుఁ దమో ♦ విస్ఫూర్తి నల్లాడినన్
మగ్నంబుం బడని నాత్రిశూల మకటా ♦ మాయింప దీభూతమున్.

విష్ణు — శంకరా! నా చక్రమును ప్రయోగించి దీనినుక్కడఁచి నీ కమందానందమును సమకూర్చెద నుండుము. (అని ప్రయోగించును. అది తిరిగివచ్చి నిలుచును.)

గంగ — అయ్యో! నాకింకేమి శరణ్యము.

పావ — హాం.

గంగ — (మూర్ఛిల్లును).

విష్ణు — ఆహా! ఇది కడుంగడు చిత్రముగ నున్నది. అవక్ర పరాక్రమమున విక్రమించు చక్రము, దిక్చక్రముల నల్లలాడించి జీవనహారియైన చక్రము నేఁడెంత వాఁడిచెడి నేలఁగూలఁబడినది!

తే. గీ. ఉడు గణంబులు మింటిని ♦ విడువవచ్చు
పర్వతంబులు భూమిని ♦ వదలవచ్చు
అగ్నియుష్ణత్వమును బాసి ♦ యుడఁగవచ్చు
కాని నాచక్రహతి రిత్త ♦ గాదు నిజము.

అట్టిశక్తి నేఁడేమైపోయినది!

బ్రహ్మ — ఇదియేమి మాయయో ఇదమిత్థమని నిర్వచించుటకు సాధ్యము కాకున్నది. ఈవసిష్ఠాదుల కేమైనఁ దెలియునేమో.

వసి — సర్వజ్ఞుఁడును సర్వపాప నాశంకరుఁడైన యీశంకరుఁడును, నిఖిలదానవలోక దారుణాగ్ని జ్వాలామాలికల నొక్కపెట్టునఁ జల్లార్చి లోకరక్షణార్థము బహువిధములఁ బదియవతారముల నెత్తి నమునాగ్ల

భువనముల సంరక్షించు నీసాక్షాత్పుండరీకాక్షుండును, చతుర్దశ భూనభోంతరాళంబులయిన బ్రహ్మాండంబు లొక్కయుచ్ఛ్వాసవాయువుచే సృష్టించిన నీవును ఈగంగ మొరాలకించి యీమెపాపవిమోచన సేయ లేకపోయిరన్న నింక నిది యెవరికి సాధ్యము?

ముగ్గురును — సాధ్యము గాదు.

నార — మీకు సాధ్యము గాదు.

ముగ్గురు — ఇంక నెవరికి సాధ్యము?

నార — కలదొకవ్యక్తి.

ముగ్గురు — నారదా? మాతో నెకసెక్కము లాడుచుంటివా?

నార — అట్లైన నేను మూడిపోనా.

మహే — నామూడవకన్ను విప్పనిదేనా.

నార — వలదు. ఇక్కడ దక్షుడుగాని, మన్మథుడుగాని లేరు. ఒకవేళ నేరక విప్పినను నీగంగను వెంటాడు పాపదేవతకు లక్ష్యములేదు.

విష్ణు - నారదా! ఇది యెవరివల్ల సాధ్యమగును?

నార — నేను మున్ను విన్నవించిన —

గంగ — (లేచి) నారదా! నాకది యెఱిగించి పుణ్యము గట్టుకొనుము. నారదా నీకుజోహారుసేయుదును.

బ్రహ్మ — అది యేదో చెప్పుము నారదా.

నార — అత్రియను నొక బ్రహ్మఋషి,

ముగ్గురు — అగును మే మెఱుంగుదుము.

నార — వాని యిల్లాలు అనసూయ,

మహే — అగును.

నార — ఆమె మహాపతివ్రత.

విష్ణు — అయిన నేమి!

నార — ఆమె తనపతివ్రతామాహాత్మ్యమున నీ గంగపాపవిమోచన మవలీలగాఁ జేయఁగలదు.

గంగ — నారదా! నిజమేనానారదా! నాకేదో గతికల్పించుము. నీకిదే వేయివందనము లర్పించెదను నారదా!

బ్రహ్మ — ఏమి యీ నారదుని కల్లబొల్లులు! మాబ్రోలనే భయము దక్కి మాటాడుచున్నాఁడు.

నార — అట్లనఁజెల్లదు! నేను నిజమాడుచుంటిని.

విష్ణు — నిజమేనా ?

మహే — మావలనఁ గాని కార్యమా మానవమాత్రి సేయ సమర్థ యగునా?

నార — ఆ పతిపాతివ్రత్య మహాత్మ్య మనిర్వచనీయము. అనుపమానము. అమోఘము. ఆమె సాధింపని పని యీచతుర్దశభువన ములయం దుండఁ బోవదు. లేదు.

విష్ణు — అంత నిక్కర్షగఁ జెప్పనొప్పునా? యిది సాహసము గాదా.

నార — కాదు.

తే. గీ. సూర్యునిన్ దీపములు పెట్టి ♦ చూపినట్లు
నోటనాలుక కలదని ♦ నుడివినట్లు
ఆపతి పతివ్రతామహా ♦ త్మ్యంబు శుష్క
వాక్యములచేత వర్ణింప ♦ వశముగాదు.

ఆమె తేజ మట్టిది. అదియొక అపురూపమైన జ్యోతి.

బ్రహ్మ — ఏజ్యోతిర్మండలము తేజోతిని గాంచి తలవంచుచున్నవో, చంద్రసూర్యాది తారాగణంబు లేపరతత్త్వ పదార్థము నవలోకించుటకై నిరంతరము నిజసత్త్వమును బ్రదీపింపఁ బరిభ్రమించు చున్నవో, యేది సదసత్పదార్థములచే భేదింపఁబడక అవాఙ్మానస గోచరమై అగాధమై

అవ్యక్తమై వ్యక్తి స్వాతంత్ర్యముల కందరాని పరిపూర్ణ ప్రత్యగాత్మ స్వరూప స్వయంజ్యోతియై ప్రకాశించుచున్నదో, అట్టి మా త్రిమూర్త్యాత్మకమైన శక్తిసన్నిధి నేదో పరకపాటి పతివ్రతను ఆమె మాహాత్మ్యమును తెగవర్ణింపుచుంటివి విది నీకు మిగుల గర్హ్యమైన పనిసుమా.

తే. గీ. మణులప్రోల నల్లనిపూస ♦ మాట యేల
శరనిధులముందు సెలయేటి ♦ చాటు వేల
ఏమృగము కాలుమోపిన ♦ నేనుఁగడుగు
మించనోపు? నట్టుల మమ్ము ♦ మింతు రెవరు?

నార — నరే! నాకిచ్చట నధిక ప్రసంగమెందుకు? మీమాటలు మీరే తుద కుపసంహరించు కొనవలసి వచ్చును.

వసి — నారదా! ఏమి నీసాహసము. త్రిమూర్తులైన యీమహనీయుల కడ్డు దగిలి వాదించుటకు జంకకున్నాఁడవే. మహాపతివ్రతయైన గౌరి, ఆ లక్ష్మీసరస్వతుల నేలపేర్కొనవు. వీరికన్న నాయనసూయ మిన్నయా?

నార — అగును.

సీ. పుట్టినింటికిఁ బతి ♦ పొమ్మనకుండఁగాఁ
బోయెను గౌరి వా ♦ పోయిపోయి
కనక కంకణములు ♦ ఘల్లు ఘల్లన లచ్చి
యిల్లిల్లు దిరుగాడు ♦ నిలువడి విడి
పలునోళ్ళలోఁ బడి ♦ పలురంగులై మాటి
రవ్వపాలయ్యె భా ♦ రతివధూటి
పుణ్యపాపంబుల ♦ మోతమోచుఁ బొక్కుచు
పాంసులయై క్రింద ♦ పడియెధాత్రి

తే. గీ. ఇట్టులూహింపఁ బ్రతిసాధ్వి ♦ కేదొ లోటు
దోచుచుండెను; అనసూయ ♦ స్త్రీయజాతి
యందు నేలోటు వొడమ ద ♦ య్యతిపమిన్న
మహిఁ బతివ్రతలకుఁ దల ♦ మానికంబు.

లక్ష్మి — నారదా! నీపొగడ్తల కేమి; ఇప్పుడు సర్వదా గర్వభంగ మైనదా?

సర — లేవు అనసూయా గర్వభంగము కూడ నగును.

నార — అది యసంభవము.

తే. గీ. ముక్కముక్కలుగా మిన్ను ♦ రక్కవచ్చు
దిక్కులన్నియు నొకమూలఁ ♦ ద్రొక్కవచ్చు
పంచభూతంబు లల్లలాఁ ♦ డించవచ్చు
కాని సాధ్వులఁ దాక నె ♦ వ్వానితరము!

బ్రహ్మ — సరే చూచెదవుగాక!

సర — తప్పక ఆ యనసూయా గర్వభంగము గావింపవలయును.

నార — వలదు; మీకే గర్వ భంగమైపోవును.

విష్ణు — నారదా! నోరుకట్టుము. ఇదె మేముపోయి అనసూయను పరీక్షించెదము.

తే. గీ. జపములను జేసి సర్వద ♦ స్వర్గపురిని
జేరలేక యధోగతి ♦ జారిపోవె

నార — కేవల పతివ్రతలఁ బరీ ♦ క్షింపఁ గోరి
మూడుమూర్తులు శిశువులై ♦ పోవఁగలరు.

సర — సరిసరి త్రిమూర్తులు శిశువులై పోదురా!

దుర్గ — నారదా! నీవు తారతమ్య పరిజ్ఞాన శూన్యుఁడవై దూరుచున్నావుసుమా!

నార — లేదు. నర్మదను మీరు స్వర్గపురినుండి నేలకుఁ ద్రోసివేసి నామని యుప్పొంగుచుండిరే గాని మహాపతివ్రత లానఁబెట్టిన దేవలోకమే వణఁకి వారిపాదములకు జోహారు సేయవలసివచ్చు ననుమాట మీకుఁ దెలియదు కాఁబోలును.

మహే — నీబీరములింక చాలించుము.

ఆకాశవాణి

తే. గీ. గంగ నీపాపచయ మింక ♦ గడవఁబోదు
కట్టి కుడుపును నీకింక ♦ గతులు లేవు
ఆమహాసాధ్వి అనసూయ ♦ నాశ్రయించి
జన్మతరియింపనేర్తు వా ♦ చక్కఁజనుము.

గంగ — ఆహా! ఆకాశవాణి యేమనుచున్నది (అని పై పద్యము చదివి) ఆ యనసూయాదేవినే ఆశ్రయింపు మనుచున్నది. నేనామెనే వెదకుచు పోయెదను.



# తృతీయాంకము

•••○○•••

రంగము – శ్మశానము

(భైరవుడు ప్రవేశించి యుండును)

భైర – నేను భైరవుఁడను. ఇది భైరవాలయము.

ఈతఁడు పిశితాశనుఁడు. ఇచ్చట నిరంతరము బలులు, వధలు, జరుగుచుండును. మద్యమ్ము కడవలకొలది నైవేద్యము పెట్టఁబడు చున్నది. పెక్కురీ మద్య మాంసములకై వచ్చి పెద్దబీభత్సము చేయుచుందురు.

(కల్లు మేకలు తీసికొని పురజనులు ప్రవేశింతురు)

పురజనులలో నొకఁడు – మానవులను దేవతలు నడుపుచుందురు. దేవతలలో భైరవుఁడు ఘనుఁడు. ఈతఁడు దేవదానవులకు అమృతము పంచి పెట్టునప్పుడు స్త్రీరూపము ధరించిన విష్ణువునకు శివునివలనఁ బుట్టినకాలుఁడు.

ఈకాలుఁడు లోకమారణము సేయుచుండ ప్రాణములకుఁ బ్రాణముల బలిసిచ్చి మానవలోకమును కాపాడు తత్త్వము శాక్తేయులు కనిపెట్టినారు. యజ్ఞాదులకు హవిస్సువలె దీనికి మద్యము ప్రధానము. మద్య మాంసములకు మించిన మోక్షమే లేదు.

పుర – నిజము.

భైర – ఇదే తత్త్వసారము.

ఉ. మద్యము మాంసముల్ మెసవి ♦ మానినులన్ జతఁగూడి హాయిగా
వాద్యములన్, వినోదములఁ ♦ బాటల నాటల సంతసించి దు
ర్భేద్యములైన మానసిక ♦ వీధుల దుఃఖతమస్సు బాసి యా
యుద్యమమందు రేబవలు ♦ నుండుటె స్వర్గము వేఱయున్న దే॥

పుర — లేదు.

భైర — (మద్యము (డ్రావి)

తే. గీ. మధువె యమృతంబు శైలూషి ♦ మంజువదన
లెల్ల దేవకన్యలు; గాన ♦ మే రసంబు
తంత్రినాదమె తేజంబు; ♦ తలప వేశ్య
వాటికయె సుమ్ము కైలాస ♦ పట్టణమ్ము.

(నాట్యాంగనలు పాటలు పాడుచు నృత్యము సేయుదురు)

పాట

నేను చంచలను
సారసిక - తెఱఁగా - దరమూ
సాంపారఁగ - సొంపార - సొంపార
సొంపారఁగ - నేను
నగవూ మోవి సొగసగువదనము
సిగపూతీవి - కావలెనా - కావలెనా

కావలెనా॥ సొంపా॥

పాటల తీరు ఆటలసొరు
నీకైననుదురు సొంపారఁగ

భైర — ఆహా! యేమి యీ కాంత యొయ్యారము! ఏమి యీ హావభావములు! ఎంతసొరు మీరుచున్నది! బలే! ఇందువదనా! బలే! యీ భైరవుని మెడలోని పూలదండ నీమెడలో నలంకరించుచున్నాను. ఈ భైరవుని పానపాత్రలో తియ్యని యాసవము నీకిదే తెచ్చి యిచ్చు చున్నాను (అని యిచ్చును).

తే.గీ. సొగసుకన్నులజిగి ♦ బిగువైన యురమును
మొగలిపువ్వు పన్ను ♦ మిగులు మేను

భోగవిలసనంబు ♦ రాగంబుగల వెల
బోటి విటుల కొంగు ♦ మూటగాదె.

విటుడు (ప్రవేశించి) ఎవరో నా పేరెత్తుచున్నాడు. ఈవిలాసిని నా యుంపుడుకత్తె. నేడు భైరవు నర్చించుటకు వచ్చినది. దీనిని వెదకుచు నేను వచ్చితిని. ఇక్కడ మంజిమొకనాటకము జరుగుచున్నది. దీనిని ప్రచ్ఛన్నముగా నిలిచి చూచెదను.

విలాసిని — (పాడుచు నాట్యము సేయును)

భైర — బలే! ఏమిసొగసు!

తే. గీ. విఱువుజూపులు నగుమోము ♦ కురల విరులు
నడుమునన్నంబు కుచభార ♦ ముడుగరాని
హారయులు కంకణక్వణనము ♦ లోలయునట్టి
యీమె విటనారిఁ జేరి య ♦ ర్థింతుఁ బ్రేమ.

విటుడు — "ఈమెవిటనారిజేరి యర్థింతు ప్రేమ" అనగా ఈవిలాసిని నా వేశ్యయని గ్రహించినాడు.

విలాసిని — (భైరవుని జూచి నవ్వి)

తే. గీ. జలజనేత్రలఁ బతు లవ ♦ సరముకోలఁది
కోరుదురెకాని ప్రేమ యే ♦ కోశమందు
నుంచ రనుమాట కల్లఁగా ♦ నెంచరాదు
వానకై పట్టు గొడుగు కై ♦ నడిఁ కలంప.

విటు — ఆహా, ఏమి యీలాగనుచున్నది. యీమెమునన్ను నామీఁద నుండి తిరిగి పోయినదా యేమి! దీని కంతకు భైరవుఁడే కారణమై యుండును.

భైర — (స్వ) నేను బహుకాలము కామినీలంపటుఁడనై చరించుటచే రోగములచేత నా యెముకలు కుళ్ళి అతుకులకుక్కి నైపోయినది.

ఒకవంక కురువులు సలువుచున్నను విలాసినీవాంఛావిభ్రాంతి నా స్వాంతమునందలి శాంతిని దూలించి యేలీలనైన నీ యెలనాగను గవయఁ గోరుచున్నది. (ప్ర) ఆహా!

పాట

వలవును మది నిలుపలేను బాల
కాలమేల వెళ్ళ బుత్తువే విశాలఫాల ॥వ॥

విలా — రసికలోకవినుతా!

భైర — కాలమేల వెళ్ళబుత్తువే విశాలఫాల ॥వ॥

విలా — రసికలోకనుత!

భైర — విలాసభాసమానోల్లాసినీ శుభాంగి కాలమేల ॥వ॥

విటు — ఇంక నాయనుమానము తేలిపోయినది. నావిలాసిని నీ భైరవుఁడు హరించుటకుఁ జూచుచున్నాఁడు. ఇంక తడవు సేయక వీని తాళముపట్టవలయును. ఓరీ దురాత్మా! భైరవహతకా యిదే నాచేతఁ జిక్కితివి. నీవిఁకఁ దాఁటిపోఁ జాలవు.

భైర — చెలీ ఒక్క ముద్దియ్యవా?

విటు — అరే నీకు నావిలాసిని ముద్దియ్యవలెనా! చూడు నీ వీవు బ్రద్దలుచేసి వేసెదను (అని తన్ని పాఱిపోవును).

విలా — ఓహో! ప్రమాదము వచ్చినది. నాయుంపుడుమగఁడు వచ్చినాఁడు.

విటు — విలాసినీ! నీసంగతి తెలసినది పద; నీశాస్తి ముందున్నది. (అని, యీడ్చుకొని పోవును).

భైర — (లేచి) హా! నిలువలేను. వ్రణములచే నిండియున్న యీ దేహము ఈవిటుఁడు కొట్టిన దెబ్బలచే మఱింత విడిపోయి యమబాధపెట్టు చున్నది. ఇంక నేనేమి చేయుదు, ఏది దారి? ఈవిటుఁడు చేసిన పరాభ

వముచే నాహృదయమును రక్తార్ణవమై పోయినది. హా! బాధ (అని నేలఁబడి) ఏదీ మద్యము (అని మూర్ఛిల్లును).

నర్మ — (ప్రవేశించి) ఇదే భూలోకము. నాచరితము నాకే విచిత్రముగ నున్నది.

మ. అపవర్గంబున కంతరాయ మని మా ♦ యామోహ సంసార ఘో
ర పయోరాశినిఁ దన్ని వేసి యల స్వ ♦ ర్గద్వారముల్ వీడఁగాఁ
దపముల్ చేసితి యోగముల్ సలిపితిన్ ♦ ధన్యాత్మనై పోయినన్
నెపముల్ మోపి ధరిత్రిఁ దోసిరి సురల్ ♦ నిర్భాగ్యనై వచ్చితిన్.

ఇంక ముందేమున్నదో చెప్పఁజాలము. మిక్కిలి మలీమసమును, అసహనమును, భ్రాంతియును ముసుఁగుదీసిన మిగుల వికారద్యోతకకమును, నైన యీప్రపంచక మహామాయా సంసారమున నొక పురుష వ్యక్తికి దాసియై సేవ సలుపక యున్న సతికి స్వర్గము లేదఁట! ఆహా! యీ స్త్రీజాతి యెంత గర్హ్యమైనది. ఎంతతుచ్ఛమైనది. నేనిందుండను. నేనిప్పుడే దీనిని ముక్కముక్కలుగఁజేసి అగ్నిలో మాడ్చి గాలిలో నెగిరి నీళ్ళలోఁ గలసిపోయెదను. నాకిఁక స్వర్గ మక్కఱలేదు. నా కా శాశ్వతబ్రహ్మ పద మనావశ్యకము. నాకు కైలాసము కక్కిన అన్నమునకన్న పరమనీచమైనది. నేనెంత మోసపోయితిని! ఎంతకాలము తప మాచరించితిని. ఎన్నెన్ని కడ గండ్లు సహించితిని. తుదకు నాకధోగతి తప్పదయ్యెను. సరే! ఇంక మిగిలినది యాత్మహత్య. ఇది యకృత్యము కాని నేను పంచత్వము పొందకమున్నె యీస్త్రీయుపాధిని శేషాద్రికో యొప్పగించి దీనినైచ్యము స్త్రీలోకమున కగపఱచెదను గాక. (అని రెండడుగులు నడచి ఆదేవమాతకు లేమిచెప్పినారు. ప్రథమ దర్శన మగువాఁడే నీమగఁడని—పాపము శమించునుగాక! నాకు మగఁడేమిటి; నేను సర్వతంత్రస్వతంత్రను గానా; నా యంతరాత్మ మహా తపశ్శక్తిచే మా

ర్తాండ మండలము వలె తేజో విరాజితమై ప్రదీపించుట లేదా! నేను మహా వీరాధివీరులవలె స్వర్గ ద్వారము బ్రద్దలుచేసికొని వెళ్ళలేనా! సరే! ఇంక నాకు స్వర్గము — యాచింపగా వచ్చెడు తుచ్ఛమైన స్వర్గము — స్త్రీ పురుష భేదములతో నిండి యీర్ష్యా గాఢాంధకారవికారద్యోతక మైన స్వర్గము నాకాలిగోరునకైన వలదు. లేదు. నాకా తలంపే లేదు. నాయంతట నేనే శుచినై నాయంతట నేనే పరిశుద్ధనై నాయంతట నేనే నా స్వర్గము నేనే నా మోక్షము నేనే కట్టుకొని నేనే యానందించెదను. నేనే నివసించెదను. నాకీ యుపాధి యక్కరలేదు. నాకీ మృతరూపకమైన స్త్రీత్వ మక్కఱలేదు. నేను జడస్వరూపమును. నేను మట్టిని. నేను బురదను. ఆమట్టిలో నొకరేణువును. ఆమృత్తికా రేణు సముదాయమే నేను. నేను అమృతమై పోవుదును (అని మూర్ఛిల్లి పడిపోవును).

ఖైర — (లేచి) ఎవరీమహిమనీయ సౌందర్యశిలా విగ్రహము. ఇది శిలగాదు. మానవ కన్య. మానవకన్యల కింతలావణ్య ముండునా?

తే. గీ. ముంగురులసౌరు, చాకు కు • రంగలోల
లోచనంబుల బారు, నీ • లోకమధుర
రాగముల తీరు మరుని సా • రంగధరుని
మీరు నీనారి చిన్ని పొ • న్నారి యహహా!

నర్మ — (లేచి) సరే. ప్రారబ్ధ కర్మ మనుభవింపక తప్పదు. కర్మ భోగావసాన పర్యంతము ప్రకృతి ననుసరించెదను. ఎవరో నాయెదుట నిలిచినట్లున్నది. ఈతఁడే నాభర్త.

ఖైర — నెచ్చెలీ! నీవెవ్వతెవు?

నర్మ — నీకు నేను నెచ్చెలినే!

ఖైర — అది యెట్లు?

నర్మ —

తే. గీ. కటిక చీఁకటి వెన్నెలఁ ♦ గాచినట్లు
నీళ్ళచేత తటాకముల్ ♦ నింపినట్లు
తపముచేత త్రిలోకముల్ ♦ దనిపి వ్యర్థ
కాలనై నేలఁబడిన న ♦ ర్మదను నేను.

భైర — (వణకుచు) (స్వ) ఇదియేదో గొప్ప ప్రమాదమే జరిగినది. (ప్ర) నిన్ను జూచిన నాకుఁ గంప మెత్తుచున్నది. ఇందలి యుదంతమేమి?

నర్మ — నేనవివాహితను. ఉత్తమక్షత్రియకన్యను. మహాతపస్సు చేసి చేరరాని దేవలోకమును చూరగొంటిని. కాని దేవతలు దేవలోకమున పతివ్రతలకుఁ గాని చోటులేదని పంపివేసిరి. కావున నిన్ను నేను పరిణయ మాడెదను.

భైర — (తలవంచి) నన్నా!

[ తెరపడును. ]

రంగము:— తపోవనము

(అత్రి, అనసూయ, శిష్యులు ప్రవేశించియుందురు)

అత్రి — దేవీ! అనసూయా! చిరకాలమునుండి యపత్యార్థమై మన మీశ్వరునిగూర్చి తప మాచరించుచున్నాము గాని మనకింకను గతి గానరాలేదు. రానురాను మండువేసవి ప్రవేశించినది. ఈ యరణ్యావాసము మిగుల దుస్సహముగ నున్నది.

ఉ. నిండినకాంతితో దిశలు ♦ నిండఁగఁ జండమయూఖపంక్తి మా
ర్తాండుఁ డుదగ్రుఁడై వెడలఁ ♦ గ్రక్కు యజాండముగాల్చివేయఁగా
నుండినయట్లు మండిపడు ♦ చుండెను; కొండలునాకలంబు లీ
యెండను మాడి బూడిదయి ♦ యింగలముల్ వెదజల్లుఁ జూచితే!
ఆహా! ఎంతదుస్సహమైన యెండ కాయుచున్నది!

మ. జ్వాలసజ్వాలలు వచ్చి లోకమును గా ♦ ల్చన్ జూచెనో రాక్షసుల్
బలులై నేటిని మ్రింగి యగ్నిమునకై ♦ సల్పించుచున్నారొ యా
ప్రళయం బిప్పుడె వచ్చెనో దశదిశల్ ♦ భగ్నంబులై పోవునో
తెలియన్ రాదు నిదాఘ మిట్టి దగునే ♦ దిక్కింక నాకున్న దే.

అన — నాథా! జనపదములన్నియు కాలిపోయినవి. ప్రజలందరు పటాపంచలై పోయినారు.

అత్రి — అగును.

చం. లలనా! ఖగంబులన్నియుఁ గు ♦ లాయములన్ విడనాడి దీనతన్
వలపలఁబోయె; జంతుతతి ♦ ప్రాణము వాసెను; వృక్షపంక్తి బా
గుఱుగ నశించె; సుందరప ♦ గోవనముల్ మరుభూము లయ్యె నీ
ప్రళయసమోష్ణకాలము భ ♦ రం బతికష్టము ప్రాణికోటికిన్.

అన — ఈమహాప్రళయము వచ్చుట కేమికారణము.

అత్రి — అనసూయా! ఇది కాలవైపరీత్యము సుమా! నాకు మిగుల దాహము వేయుచున్నది (అని మూర్ఛిల్లును).

అన — అయ్యో! కుండలోని నీరుసహితము ఎండిపోయినది. ఇంక నేనేమి సేయుదును. ఇంక నానాథునిదగ నెట్లుతీరును.

తే॥ గీ॥ ప్రాణనాథుఁ డడిగిన నీ ♦ రైన దెచ్చి
యియ్యలేనట్టి సతిబ్రతు ♦ కేల దాహ
తప్తుఁ డగు మిత్రునకు గొంతు ♦ దాక నీట
మునిఁగి దగ దీర్పలేని ప ♦ ద్మినివిధాన.

అయ్యో! ఇంకనానాథుని దగదీరు నుపాయమేమున్నది. శిష్యులారా, మీరిచట జాగరూకులై యుండుఁడు. నేనువెళ్ళి నీళ్ళెందైన దొరుకు నేమో చూచి వచ్చెదను.

శిష్య — అమ్మా! గంగ భూలోకమందే లేదట!

అన — అది యేమి?

శిష్య —

తే.గీ. అమ్మగంగాదుల్గానను ♦ నాత్మభవుల
నేఁటుగురిఁ జంపి పాపంబు ♦ తోడ నరక
మందుఁ బడి స్వాయంద ద్ధయై ♦ బ్రమందుచుండె
నిప్పుడేగాని నీరూరు ♦ నెలవు లేదు.

అన — లేదని యూరకుండఁజెల్లునా! పామపతివ్రతా యుగుగంగపై మీరారోపించినదోషములు విశ్వసనీయములుగావు.

శిష్య — సరే! క్రమముగా మీకే తెలియును. పాద్యమునాఁ డగ పడనిచంద్రుఁడు విదియనాఁడు దాగునా?

అన — (కలశము తీసికొని) జలమెందేని లభించునేమో చూచెదగాక (అని వెడలును).

అత్రి — దేవియేది?

శిష్య — అమ్మగారు నీళ్ళకై వెళ్ళినారు.

అత్రి — ఎట్లు వెళ్ళఁగలిగినది. ఎండ నేఁడు మిక్కిలి భయావహముగ నున్నది గదా!

ఉ. నివ్వలు రాలుచున్నవి య ♦ నేకతరుప్రకరంబు లెండిపో
నొప్పెడి యెండలో నడచి ♦ యొంటిగ మాయనసూయ పోయె నే
చొప్పున నీళ్ళు తేగలుగుఁ ♦ జూడఁగరాదు పరాత్పరుండు నా
యొప్పులకుప్ప సుందరస ♦ ముజ్వలగాత్రకుఁ దోడునీడగున్.

అనసూయ — (దూరముగ ప్రవేశించి)

పాట

సుజలాగారమీశాన లోపలఁగలదా
జూపరే మొరవిని సురలారా.

నానాథుఁడు దగతోఁబడి గాసిఁజెందిజలము
గోరపయునవైతి నీనదికి ॥సు॥

అయ్యయ్యో యెక్కడ వెదికినను చేరెఁడు నీళ్ళు లభింపకున్నవి. ఓ దైవమా! యింక నేది గత్యంతరము. మా దేహము నీ దాహాగ్నిని దహింపఁ జేయుటకే నీ సంకల్పమైనచో మేము పరమ సంతోషముతో నీ ప్రాణము లాహుతి నేయనున్నాము. నాభర్త దాహార్తుఁడై తపించి పోవుచున్నాఁడు. నేను మిగుల వసివాఁడిపోయితిని. యీపిడుగులు రాల్చుచున్న యెండలో నాకాళ్ళు మాడి పొక్కులెక్కినవి. నేనింక నొక యడుగైన ముందర కిడఁజాలను. (నేల చదికిలబడి),

పాట

మాకాలాగతికి ఇంకేమననూ
ఈకానన్ జలము లభింపక మాప్రాణ
మూడిపో వ్రాసిన విధిని.
జయింప నొంపనెవరులేరు. ॥ మా ॥

గంగ — (ప్రవేశించి) అయ్యో, ఈపాపదేవత నృత్యమునకు ఛాయ వలె నా వెన్నాడుట మానకున్నది.

మ. పసుపో కుంకుమొ తారహారచయమో ♦ వస్త్రంబులో, మాడలో,
మెసవన్ గుంభమొ మాంసమో; మధువో పే ♦ ర్మిన్ గోరుమేనిత్తు న
క్కసుదీరన్ నను బీల్చి వేయకుము నా ♦ కాయంబు నీ రయ్యో ర
క్కసి పాపానలరాశి నన్ను విడువం ♦ గారాదె సీ మ్రొక్కెదన్.

పాప — హుం.

గంగ — అయ్యో! చంపివేయకుము. ఇంకేమిగతి.

చం. ఉడికెడు సున్నమట్లు కలు ♦ షోదధి పొంగ మునింగి పోతి నా
యొడలు దహించి పోయె నిలు ♦ పోపక యేగితి మూఁడులోకముల్

కడకుఁ ద్రిమూర్తు లాత్రిదివ ♦ కాంతలు నాకలుషంబు బాపకే
విడిచిరి యర్ఘ్యమున్, విడిచి ♦ పెట్టినరీతిఁ దిలోదకమ్ములన్.

అట్లు హతాశ నగు నా యవస్థం జింతించి సకల విజ్ఞాన విశారదుఁడగు నారదుఁడు అనసూయ నాశ్రయింపు మని యానతిచ్చినాడు. అదే ఆకాశ వాణి పాడినది! మహాభాగ్యమని గ్రహించి యీయత్రి తపోవనమునఁ బ్రవేశించితిని. కాని, యీయనసూయ యింకను నాకుఁ గానరాలేదు.

అన — అక్కటకటా! ఎంతదురవస్థ వచ్చినది.

ఉ. చేరెఁడు నీళ్ళకున్ బడలి ♦ జీవమువాసెడు మమ్ముఁ జూచినన్
గూరిమిరాదె దీనజన ♦ కోటిని బ్రోచెడువారు లేరె సం
సారవిషాబ్ధి జచ్చి చితి ♦ శాంతివహింపఁగ నాఋణంబెటో
తీరునుగాని భర్తదగ ♦ దీర్చని దుఃఖముపోదు నామదన్.

(అని మూర్ఛిల్లును)

గంగ — ఎవరి దాయార్తనాదము.

అత్రి — శిష్యులారా! మీయమ్మ యెందేగినదో వెదకి తీసుకొని రాఁగలరా?

శిష్య — జొన్నలు నేలఁజల్లినఁ బేలాలై పోవుచున్న యీభూమిపై మేమొక్కయడుగైన మోపఁజాలము.

అత్రి — అయ్యో! మీరే యిట్టులనుచుండ నీయెండ కా యనసూయ యేమైపోవునోగదా. దేవీ! నీవేల నన్ను వదలిపోయితివి.

ఉ. ఓచెలి! నీవునాయెదుట ♦ నుండినఁజాలును క్షుత్పిపాసలే
తోచవు రేబవళ్ళు సుఖ ♦ దుఃఖము లుండవు కల్మిలేములున్
గోచర మింత కావు సుమ ♦ కోమలి! యోయనసూయ! సర్వమీ
వై చరియింతు వీశ్వరుని ♦ యట్లు దలంతు భవత్స్వరూపమున్.

గంగ — (అనసూయను సమీపించి)

చం. సొగసుల దీఁటీవిఁ గను ♦ సొంపులునింపు సలింపకాంతలన్
బెగడునఁ జేయు నీయుఃనిద ♦ భీతకురంగవిలోలనేత్ర పెన్
దగఁగొని మూర్ఛవోయెను ని ♦ దాఘ మహాతపవహ్నికీలలన్
నొగిలిన పూలతీవన మ ♦ నోహరరూపము మాటుసేయుచున్.

పాప నీ మెకొకంత జలము పోసిన బ్రతుక వచ్చును. ఆర్తరక్షణము మహాపుణ్యముగదా. అందును ఆర్తనైన నాకిది లెస్సగ నెఱింగినపాఠము. ఈ నిర్జలారణ్య ప్రదేశమున హిమ శీతల జల ప్రవాహమును ఘటించి యీయంచయాన పదసరోరుహంబుల స్పృశించి తరించెదగాక. (అని అదృశ్యయై పర్వతమునుండి ధారారూపమున వెలువడును)

అన — (కన్నులు తెఱచి) అయ్యో భర్తగారికి నీళ్ళియ్యలేనైతి నింక నేమి గత్యంతరము. ఆకొండనుండి యేదో స్రోతస్సుదయించు చున్నట్లున్నది. ఆహా! నాకన్ను లెంత చల్లఁబడినవి.

మ. గిరి గర్భంబుల రెండుఁ జీల్చికొని సం ♦ కీర్ణంబులై చారుని
ర్ఝరముల్ వెల్లువలొత్తు నీవసుధ స ♦ స్యశ్యామలం జేయఁగాఁ
బరతెంచెఁ; మరుభూమి రాక్షసివలెఁ ♦ భక్షించు నాకొస్న మో
హారతిఁ; స్వార్థపరాయణుల్ పరుల లా ♦ భైశ్వర్యముల్ చూతురే.

(లేచి) ఆహా, గంగ పొంగి పొరలి యిదే వచ్చుచున్నది.

పాట

ఆహా సలిలము నది యిదిగో
శిలల నడుమ సెలయేరులు పొడమెన్
మింటికి ధారలు నెగయన్.
గంటికి వింతలు గొలిపెన్.
ఎంతో సంతసము, చింతలువాసెను
శాంతిని దగ దీర జలము గొనెద ‖ ఆహా ‖

కరుణారససమన్వితుఁడై పరమేశ్వరుఁడు నాకొఱకాలకించి యీ స్వచ్ఛమైన, సుధాసదృశమైన శీతలజలస్వరూపమున ప్రసన్నుఁడై యుండనోపును. లేకున్న నీ మరుభూమిలో నీ మండువేసవిలో నీగిరి గహ్వరమున నీరెక్కడిది? ఇవి మాకు చిరపరిచితములైన ప్రదేశములు గావా! ఇదియంతయు నాప్రాణవల్లభుని తపోమాహాత్మ్యము. (అని కలశమున నీళ్లునింపుకొని, వేవేగముగ అత్రిని సమీపించి నాథా! ఇవిగో నీళ్లు! వేగ్రదావుఁడు లెండు. (అని కాళ్లమీద పోసి లేపి వెనుకకు చూచుసరికి గంగ ప్రవాహమున వెన్నాడి వచ్చును)

అత్రి — దేవీ! ఈసుధాసముజ్జ్వలమైన గంగ నెట్లు వెంటఁ బెట్టుకొని రాఁగలిగితివి. నీమహాత్మ్య మనన్యసామాన్యము సుమా!

అన — ఆపోరూపిణి యైన గంగ సర్వాంతర్యామినియు, సర్వజగదాధారిణియుఁగాదా, ఇచ్చట ప్రసన్నయైన దన్న వింత యేమున్నది? ఇది యంతయు తమ పూజాఫలితము.

శిష్యు — కాదు తల్లీ! నీదే మహాత్మ్యము. ఈ జలదేవత నీ వెంట నంటి రాకున్న మాప్రాణము లాయమదేవత లీపాటికి వాలుకాధూమమువలెఁ బీల్చి వేసియుందురు. మాకప్పుడే ఆకాశయాన గమనాగమన మహాకోలాహలము లభించి యుండును. మాతా! ఈ శీతల సలిలములు పోసి మాప్రాణములు నిలిపితివి (అని మొక్కి నీళ్లు చేరలతో దీసి త్రావుచున్నారు.)

అత్రి —

ఉ. వంచనయందు ప్రేమయుఁ గృ ♦ పాణమునందుఁ గృపారసంబు వ
ర్షించినరీతి నాగిరిద ♦ రీవర గర్భమునుండి నిర్ఝరీ
సంచయ మేగుదెంచె నిట ♦ స్వర్గకవాటము విప్పి నట్లు శో
భించుచు నున్నదీ ప్రళయ ♦ భీతసిదాఘము మాటుసేయుచున్.

అన — నాథా! మనమీజలాధిదేవత నారాధించెదము రమ్ము.

పాట

ఆపోజ్యోతివి తేనమో గంగా
మాపై నీకృపఁ జూపు శుభంగ.
మధురపూర హిమవారిస్రోత్రి
నేపూజించి పడసితి శాంతి.

గంగ — (ప్రత్యక్షమగును)

అత్రి, అన — ఓ గంగామాతా!

శ్లో. ఆపోరూపా సగుణభరితా సర్వలోకైకమాతా
సర్వారంభా ప్రణవవినుతా శాంత విద్యుత్ప్రపూతా
భవ్యాకారా దివిజవినుతా పాపనిర్ముక్త పాదా
త్రైవేణ్యాఖ్యా అమృతసదృశా తేనమో దేవి గంగే!

[తెర]

## చతుర్థాంకము

రంగము:- భైరవుని గృహము

(భైరవుడు, నర్మద ప్రవేశించియుందురు)

భైర — నర్మదా! నర్మదా! యెక్కడకుఁ బోయినావు.

నర్మ — ఇక్కడనే యున్నాను.

భైర — ఏది మద్యము!

నర్మ — (అందించును)

భైర — (త్రాగి) ఎంతహాయిగా నున్నది.

నర్మ — నాథా! ఈసురాపానము స్వర్గమార్గమున కవరోధమును మహాపాపమును కాదా?

భైర — నీకెవరు చెప్పినారు. వారంతా భ్రాంతులు.

నర్మ — జ్ఞానులే భ్రాంతులా?

భైర — ఆహా! ఒకపారసీకకవి యెంతమహనీయుఁడో చూడు.

ఉ. నెచ్చెలి స్వర్గమో యనుచు ♦ నీకడియాసయదేల స్వర్గమం
దచ్చర లాసవంబులె క ♦ దా కల వంతియ వేఱులే వవే
యిచ్చటనున్న వింకఁగల ♦ వే త్రిజంగబులుచూపనేర్తువే
వచ్చునికల్లు కాంతకును ♦ వేఱుగ వైభవమేమి యున్నదో.

కావున తేనర్మదా, తే! ఆమధుపాత్ర మిటు తేదెమ్ము.

ఉ. చీకులు రొట్టెముక్కలును ♦ సీధువునొక్కరహస్యమందిరం
బోకమలాక్షి! యున్న నిఁక ♦ నుజ్జ్వలరాజ్యపదంబు నొల్ల నా

నాకలుషావహంబులు య ♦ నంతదురంత విచారఘోర దు

ర్వ్యాకులమై తనర్చెడు ప్ర ♦ పంచము నీగతి నే దరించెదన్.

(అని మధుపానము సేయును)

ఆహా! బ్రహ్మానందము తలకెక్కినది. నర్మదా పుండ్లు సలుపుచున్నవి.

నర్మ — మందు రాయుదునా?

భైర — రాయుము.

నర్మ — (రాయుచున్నది)

భైర — నర్మదా! చంచల నొకసారి తీసికొని వచ్చి నాయెదుట నాట్యము సేయింపుము.

నర్మ — నాథా! మీయానతి నిదే మీవిలాసినీ మందిరప్రాంగణమునకు బోయి యామెను బిలుచుకొని వచ్చెదను (అని ప్రయాణమై) ఆహా! విధివిధాన మనుల్లంఘ్యము (అని కన్నుల నీరు పెట్టుకొని) పెండ్లి యాడినది మొదలు ఈ భైరవుఁడు నన్నునే స్త్రీజనదూష్యములైన మహాపాపకార్యములలోఁ బెట్టి గానుగలోఁ బెట్టిన చెఱకువలెఁ బీడించి పీల్చి పిప్పిచేయుచున్నాఁడు. కాని యీ మొండిప్రాణ మెంతకైన నూడి పోవకున్నది. ఆహా! హతవిధీ!

సీ. తపము సేయుట కంటె ♦ నుపవాసముల కంటె
గాంతుని సేవయే ♦ కఠినతరము
పేదరికము కంటె ♦ భిక్ష మెత్తుట కంటెఁ
గాంతుని సేవయే ♦ కఠినతరము
బండి లాగుట కంటె ♦ బానిసపని కంటెఁ
గాంతుని సేవయే ♦ కఠినతరము
కూలి సేయుట కంటె ♦ నాలఁ గాచుట కంటెఁ
గాంతుని సేవయే ♦ కఠినతరము

ఆ.వె. అంతకొంతతో పాప • మాచరించినఁగాని
కాంత గాదు మఱియుఁ • గాంతునింట
అత్తవారిసేవ • నాచరించుటకంటె
పడఁతి కింక నరక • బాధ గలదె.

(అని వెడలును)

భైర — విలాసినివచ్చునోలేదో! వచ్చి,

చం. తరుణిపదాబ్జయుగ్మమును • దాఁకినఁ జాలును రాజ్యలక్ష్మి నే
కురినవిధంబగున్; రమణి • గూర్చివచించినదెల్ల వేదమై
పరఁగు; మదీయమానసము • భామిని కొంగునఁగట్టుకొన్న దా
వరరుచిరాంగి నావలపు • వాకిలి దక్కునొ లేదొ ప్రేముడిన్.

నర్మ — (ప్రవేశించి) (స్వ) ఆమె కెంతో ధనము కావలెనట. నాయొద్ద నొక్క కాసైననుగానరాదు. దైవమా! నేనేమి చేయుదును? (ప్రకాశముగా) నాథా! విలాసిని, —

భైర — తీసికొని వచ్చితివా?

నర్మ — ఆమెకు వేయిమాడలు కావలెనఁట! అంత ధన... రయొద్ద నెక్కడిది?

భైర — నన్ను నేను వరశుల్కము గైకొననిదే పెండ్లియాడక... ఇప్పుడు నాకు ధనమవసరము వచ్చినది. నీవెట్లు సంపాదించెదవో నా కాచంచలను సమకూర్పవలయును.

తే. గీ. ఏవిధంబుననైన నా • యువతి యిన్న
నావశంవద కానిచో • జీవములను
విడిచివేయుదు సత్యంబు • విడుచునట్లు
విషముద్రావిదొ యెడకురి • బెట్టుకొనియొ.

నర్మ — (స్వ) అయ్యో దైవమా! నా కెన్నిపాట్లు తెచ్చి పెట్టితివి? ఇంక నేనేమి సేయుదును! నాకేమి గత్యంతరము? విలాసిని ధనమియ్యనిదే రాదు. రానిచో ప్రాణముల విడిచెద నని నావిభుఁడు ప్రాయోపవిష్టుఁడై మండిపడుచున్నాఁడు. (ఆలోచించి) సరే, పోయి ఆవిలాసినినే సమాధానము చేసి ఆమెకు దాస్యమైన సలిపి తీసికొని వచ్చెదను.

(అని వెళ్లును)

శైర — (మధువు త్రాఁగి) ఏదీ ఆ చంచల ఇంకను రాలేదేమి?

కం. కన్నులకుఁ గలువు దీఱఁగఁ
జన్నారి మనోహరాంగి ♦ చేడియఁగని నే
నన్నియు మఱచితి నాకా
కన్నియ యావన్నెలాడి ♦ కావలె నిపుడున్.

నర్మ — (స్వ) విలాసినితో నాయుందంతము విప్పిచెప్పితిని. ఆమె తనకు కావలసిన వేయిమాడలకు బదులు నాతల వెంద్రుకల నిమ్మని కోరినది. సరేయని నేనామెకు సమర్పించితిని. కాని నావల్లభుని తన యింటికిఁ గొనిరమ్మని నివేదించినది. ఈసంగతి నే భర్తగారికెఱిఁగించెదను. (ప్రకాశముగ) నాథా!

శైర — దేవీ! విలాసిని వచ్చినదా?

నర్మ — మిమ్ములనె తనయింటికిఁ దీసికొని రమ్మనినది.

శైర — ఆహా! గొప్పప్రమాదము.

నర్మ — అది యేమి?

శైర — దాని విటుఁడు మహాఘాతకుఁడు.

నర్మ — అటులైన నాపాతకిని బరిత్యజింపవలదా?

శైర — నాప్రాణ పరిత్యాగ మైనవ్వాజే.

నర్మ — (స్వ) ఆవిలాసినీ విటుఁడు కొట్టిన దెబ్బలింకను వీనికి మాన లేదు. కాని కామినీలంపటత్వము వదలకున్నాఁడు.

ఆ. వె. వెలఁది యింటనుండ ♦ వెలవెలందులకయి
ప్రాకులాడు దుష్ట ♦ పశువులకును
బ్రహ్మ వుల్లు పెట్టి ♦ బాధించుచున్నను
బుద్ధిరాదు దుష్ట ♦ బుద్ధులకును.

(ప్ర) నాథా! మీరు భయ పడవలదు లెండు! నేనుమీకు బాసటనై యుందును.

ఖైర — అటులైన బోదము పద.

నర్మ — లెండు పోదము.

ఖైర — నేను లేవలేను. నీ తలవెంట్రుక లూతగా నొసంగుము. పట్టుకొని లేచెదను.

నర్మ — నాథా! తలవెంట్రుకలిప్పుడే తీసివేసితిని.

ఖైర — ఏమి! యేమి! నేనుండగనే నీకు శిరోముండనమా!

నర్మ — విలాసిని వేయిమాడల నిచ్చినఁగాని సమ్మతించినది కాదు. ఆధనమునకు బదులుగా నాతలవెంట్రుకలనడిగినది. కావుననిచ్చి వేసితిని.

ఖైర — ఆహా! ఇదియా యుదంతము. సరే ఎట్లో నన్నావిలాసిని యింటికిఁ జేర్చుము. నేనీ కురుపులబాధవలన నొక్కయడుగైన వేయలేను.

నర్మ — సరే, యీగంపలోఁ గూర్చుండుఁడు. నేను నెత్తినెత్తుకొని పోయి యామె కప్పగించెదను. (అని గంపలోగూర్చుండఁబెట్టి నెత్తి నెత్తుకొని నడచుచు) నాథా! మనము దారి తప్పలేదుకదా!

ఖైర — లేదు నడువుము. వేవేగనడువుము. ప్రొద్దుపోయినది.

నర్మ —

తే. గీ. కటిక చీఁకటిలో దారి ♦ గానరాదు
ముండ్లు గల కాన యిది కడ ♦ గండ్లు వడుచు
నెంతనడిచిన విటిదిడ్డి ♦ గంత రాదు
నెత్తి బరువెక్కె నిఁక ♦ నాకుమిత్తి లేదె!

(వాలఖిల్యాదిఋషులు చెట్లను వ్రేలాడుచు.)

వాల — తే. గీ. తిండితిప్పలు మాని యీ ♦ తీరు రేయి
పగలు చెట్లను వ్రేలాడి ♦ పక్షులట్లు
తపము చేయుదు మీశ్వరా ♦ ర్థంబు స్రుక్కి
చేరువను మోక్ష మున్నదే ♦ జీవులకును.

రాజభటులు — (నర్మద నడ్డగించి) ఎవ రీయర్ధరాత్రి గంప నెత్తుకొని పోవుచున్నారు. ఆగు మాగుము.

నర్మ — (ఆగి) నాయనలారా! నేనొక మగనాలిని. ఈగంపతో నాభర్త నెత్తికొని పోవుచున్నాను.

రాజ — గంప దింపుము.

నర్మ — (దింపును)

రాజ — (కౌశికుని జూచి) వీఁడు నీభర్తయా! రోగివలె నున్నాఁడే!

నర్మ — అగును.

రాజ — తలబోడిదానికి భర్తయేమి! ఇది వితంతుస్వయంవరమా యేమి!

నర్మ — (స్వ) దైవమా! నేనీవిపత్తు నెట్లుగడవఁగలను. (ప్ర) నాయనలారా! నేనొక దిక్కులేనిపక్షిని. నాయాదంత మేమని చెప్పుకొందును.

ఉ. తల్లియుఁ దండ్రి లేరసి ని ♦ తం డిపుడే యిలు వెళ్ళఁగొట్టు నే
కల్లలనాడితో వరుని ♦ కట్నముదెమ్మని కోరుచుండె నా

వల్లను గానికార్య మిది ♦ వల్లభుఁడున్ వినఁ డెన్ని చెప్పినన్
వెళ్ళినఁ గొట్టఁబోవు తల ♦ వెంద్రుకలమ్మి ధనంబు కూర్చితిన్.

రాజ — ఆధన మేమిచేసినాఁడు!

నర్మ — సుప్రసిద్ధ నర్తకి యగు విలాసిని భోగార్థము సమర్పింపవలసి వచ్చినది. ఇప్పు డామెయింటికే పోవుచు మీకంటఁబడినారము. మమ్ము విడువుఁడు. మీకు మ్రొక్కెదనను.

రాజ — అమ్మా! నీయుదంతము విన్న మాకడుపు చెక్కలై పోవుచున్నది. నీయట్టి శాంతశమదమాద్యనంతకల్యాణగుణములు గల యువతీమణు లీలోకమున మిక్కిలి తక్కువగ నున్నారు.

2 రాజ — లేరనవలసినదే!

తే. గీ. వయసునకుఁ బెద్ద రూపంబు ♦ నట్టిసున్న
కారునలుపును, బెద్దరో ♦ గంబువాఁడు
కోపి కులహీనుఁ, డజ్ఞాని ♦ కుచ్ఛితుండు
భర్త కానోవు నని విధి ♦ వ్రాసె నీకు.

నర్మ — (స్వ) అయ్యో! యీదండధరులు నాభర్త నేమి సేయుదురో గదా (అని యేడ్చును).

1 రాజ — తల్లీ! నీవేడ్వవలదు.

2 రాజ — ఆమెకు, ఏడ్పుగాక నవ్వొట్లువచ్చును.

తే. గీ. పెండ్లియాడి మగఁడు వెల ♦ వెలఁది పంచ
పొంచి పల్లవులకుఁ దల ♦ వంచి తిరుగు
చుండఁ గులపత్ని కని యేడ్వ ♦ కుండునొక్క-
వసుధ దొడ్డిపోయిన పేద ♦ వాని పగిది.

రాజ — ఆహా! లోకమున నట్టి దుర్మార్గు లున్నారు!

తే. గీ. వధువు నొద్దఁ గట్నము గొని ♦ పడపుఁజెలుల
సుంకములకు సమర్పించు ♦ క్షుద్రవరులు
గలరు మనదేశమున లజ్జ ♦ గలదె వారి
బ్రతుకు లధమంబు లల సంత ♦ పసులకంటె.

నర్మ — అయ్యలారా! నానెత్తి సీగంప నెత్తుఁడు; నేను పోయెదను.

రాజ — ఓరిబడుగా! యిప్పుడైన బుద్ధి తెచ్చుకొని యింటికిపొమ్ము.

భైర — నేను బడుగునా, నీవేమో ఘనుఁడ ననుకొనుచున్నావు.

తే. గీ. దంష్ట్రముల విప్పి వేదండ ♦ తండకుంభ
ములను జీల్చు సింహాలకో ♦ రల నగల్చు
కాలనాథుని ముంగ రే ♦ ఘనులు నిలువఁ
గలరు ప్రకృతి నడ్డను వారు ♦ గలరె ధరణి.

నర్మదా! మధువు తెమ్ము. నేను బడుగునా?

తే. గీ. వల్లనగు వెంబ్రుకలముడి ♦ తెల్లవడును
దేహ మంతయు ముదిరి ♦ నిస్తేజ మగును
కాలనాథునిహాతికి ది ♦ గ్దంతులైన
తలలు వంచి నమోయన ♦ వలయుఁగాదె!

రాజ — ఓహో! వీఁడు దేవతల్లకుఁ బంచాంగములు చెప్పు వానివలె నున్నాఁడే (అని నర్మద తలపై గంపనెత్తి వెళ్ళిపోవుదురు.)

నర్మ — (కొంతదూరము పోయి) ఏమాయలికిడి?

భైర — ఏదో పాడుదోమ నాచెవి కొంతికివేయుచున్నది. దాని తెగులు కుదుర్చునని రెండుచేతులతో చరిచినాను. ఏదో తాటి కాయంత మెత్తని పండు నాదెబ్బ తగిలి విచ్చిపోయిన ట్లయినది. (పెద్ద కలకలము)

నర్మ — ఏమా కలకలము!

భైర — ఈచెట్టంతయుఁ గదలిపోవుచు పెద్దపెద్ద [illegible] చేయు చున్నవి. నర్మదా! ఇది చూచితివా నాకేమో నా [illegible]. వేగముగ క్రిందికి దింపుము.

నర్మ — (దింపుచు) ఆహా! ఏమి యీవిపరీతము.

వాలఖిల్యులు — ఓరోరి దురాత్మా! [illegible]

తే. గీ. ఒరులఁ దెగడక తపము చే ♦ యుచును నిట్లు
చెట్ల వ్రేలాడు మాచెంప ♦ చెళ్లుమనఁగఁ
గొట్టి నవ్వెడతఁడు తుద ♦ ముట్టి చేవ
ద్రొద్దుపొడిచిన తోడనే ♦ పోలియుఁగాత.

నర్మ — ఆహా! ఎంతప్రమాద మాపాదించినది.

వాల — మేము వాలఖిల్యులను ఋషులము.

భైర — అయ్యోనర్మదా! ఇంక నాకేదిదిక్కు? ఋషిపుంగవుల శాప మమోఘము. అప్రతిహతము. ఇంక నాచావు నిక్కము. ఆహా నర్మదా! నన్ను వదులు కొందువా? నాతప్పులు క్షమించి నాచావు తప్పించు నుపాయ మాలోచింపుము. నర్మదా! నీపాదములపైఁ బడెదను. నాకు నీవు తప్ప వేరాధారము లేదు. వేరు శరణ్యములేదు. (అని కంపించుచు),

ఉ. పాపము లెన్నొ చేసితిని ♦ పణ్యవధూటుల కంఠహారమై
మాపును రేపు భోగముల ♦ మధ్యమునం బడి ప్రేమ లూరు నీ
తాపతనంబులన్ హృదయ ♦ తాపము లారఁగ మఱ్ఱ మానుచున్
గాపుర మెల్లసౌఖ్యముల ♦ కాపురమున్ బొనరించితిన్ సతీ!

అట్టి నాకిట్టి దిక్కుమాలిన చావు వచ్చినది. నర్మదా! రక్షింపవే నర్మదా! (అని కాళ్ళపై బడుచు) నేను పామరుడనే. నేను నిరీశ్వరుఁడనే. కాని నాచెవి నీశాపము వినఁబడినతోడనే నాయొడలు కంపించుచున్నది.

నర్మ — నాథా! మీకేమియు భయము లేదు. యీవాలఖిల్యాదు లిచ్చిన శాపముచే సూర్యుఁ డుదయించినఁగదా మీకు చావు వచ్చును?

శా. మార్తాండుం డుదయింపఁబోఁడు వియ ♦ న్మార్గంబునం దొంటిపై
వర్తింపక సమకట్టుతేఁ డలిగి యా ♦ బ్రహ్మాది దిక్పాలకుల్
కర్తృత్వంబు వహించి వచ్చినను ♦ సాగంబోవ దేనాఁడు నా
భర్తన్ జంపని వద్దతిన్ రవి నభో ♦ భాగంబుపై రాఁదగున్.

భైర — నర్మదా! నీమాట విని సూర్యుఁ డుదయింపకుండునా; అయ్యో! నాకింక నెక్కడియాస!

నర్మ — నాథా! భయము వలదు. సూర్యుఁ డుదయింపఁడు. మీప్రాణముల కేమియు హాని రానేరదు.

భైర — నేను మహాపాతకుఁడను. దుర్జనుఁడను. అవివేకిని. పరకామినీ లంపటుఁడనై నీయట్టి సాధ్విని సుగుణవతిని లావణ్యసీమను పలుబాములఁ బెట్టి తుద కావిలాసిని యను తొత్తునకై నీతలకట్టు నమ్మించితిని. నాయట్టి ద్రోహి యీ మహామహీతలమునఁ బుట్టఁబోఁడు, లేఁడు, నాకిఁక పుట్టుగతులు లేవు. దేవీ నర్మదా! నాకేమి గత్యంతరము. అయ్యో నాయొడలు కంపించుచున్నది. నాప్రాణము లిప్పుడే లేచిపోవుచున్నవి. (తెరలో కలకలము) అదిగో! సూర్యుఁ డుదయించుచున్నాడు. పక్షులు రుతములు చేయుచున్నవి. అదిగో! ఉషస్సు! నాప్రాణము లుష్షున చీల్చివేయనున్న రాక్షసి, అయ్యో! నాగుండెలు నీరైపోవుచున్నవి. నర్మదా! యింకను జూచెదవేమి (అని కౌఁగిలించును).

నర్మ — నాథా! మీకేమియు భయము లేదు.

[త్రిమూర్తులు, దేవతలు ఆకాశమునుండి దిగివత్తురు]

భైర — నర్మదా! ఈదయ్యము లెవరే.

నర్మ — మహామహులైన ముక్కోటిదేవతలు.

భైర — పిరి నీ వేమోలుఁగుదువు?

నర్మ — మన్నొకనాడు ఘోరతప మాచరించి నేనీ త్రిమూర్తులను ఈముక్కోటి దేవతలను దర్శించి వచ్చితిని.

భైర — దేవలోకమునకుఁ బోయినవారు తిరిగి మానవలోకమునకు రారఁట గదా.

నర్మ — అగును; నేను రావలెనని వెళ్ళలేదు. వారే స్త్రీల కందు చోటు లేదని నెట్టివేసినారు.

భైర — అటులైన నిప్పుడు వీరిచ్చటి కేలవచ్చినారు?

నర్మ — వారు సర్వసమర్థులు.

భైర — అయిన,-

నర్మ — కర్మసాక్షి యగు సూర్యభగవానుఁ డుదయింప లేదని చెప్పుటకు వచ్చినారు.

భైర — నిజముగా!

నర్మ — అగును.

భైర — శహాబాష్ నర్మదా! శహాబాష్. నీశక్తి నెవరు వర్ణింపఁ గలరు? నీవు మహాపతివ్రతవు. నీమూలముననే నాకిన్ని గారములు జరిగినవి. దేవి నర్మదా!

తే. గీ. అడుగు మోపినఁ గనుగందు ♦ ననుచు మాట
లాడు-చోటను రతనంబు ♦ లూడుననుచు
గంటికిని రెప్పవలె నాత్మ ♦ కాంతునకును
సేవచేసిన కులకాంత ♦ వీవుగావె!

దేవీ! నేనెన్నిజన్మము లెత్తినను నీఋణము దీర్చుకోలేను. నన్ని విపత్తునుండి కాపాడుము.

ఇంద్రుడు — లోకమున కెంత విపత్తు సంభవించినది.

చం. ప్రకృతి మాయనెట్టి యన ♦ ర్విని వెలింగెడు కర్మసాక్షి నేఁ
డొకట నభంబుపై వెడలఁ ♦ డాగెను జగంబు లయంబు నొందఁగా
వికవికలాడుచున్నది ప్ర ♦ భిన్నములయ్యెను కర్మ లెల్ల నీ
ప్రకృతివికృత్పరంపరలఁ ♦ బాయుట యెట్టులొ తోఁచదయ్యెడిన్.

విష్ణు — ఆన మానుమని నర్మదనే కోరవలయును.

బ్రహ్మ — అగును.

రుద్రు — నర్మదా! (అని సమీపించుదురు).

నర్మ — త్రిమూర్తులారా! మీకు నమస్కారము.

త్రిమూర్తులు — కల్యాణివి కమ్మ.

రుద్రు — నర్మదా! నీవు త్రిలోకపూజిత వగు మహాపతివ్రతవు. నీ యాన ననుసరించి కర్మసాక్షియగు సూర్యుఁ డుదయింపలేదు. జగజ్జీవలోక మంతయు లయమైపోవుచున్నది. ఇది మహాఘోరము. కావున నీయాన నుపసంహరింపుము.

నర్మ — దేవతలారా! మీయాజ్ఞ శిరసావహించెదఁ గాని, దాన నాపతి కారాటము రాకుండ మీరు కాపాడుదుమని సమయము చేయుఁడు.

బ్రహ్మ — అది యసంభవము.

విష్ణు — ఈవిషమస్థితి గడచుట యెట్లు? అది మునిశాపము; ఇదీ పతివ్రతా మాహాత్మ్యము!

తే. గీ. అస్త్రములు రెండు కలసి పో ♦ రాడెనేని
రెంటి నొకసారి యుపసంహ ♦ రింపరాదు
కత్తివలె వర వాడివై ♦ గ్రాలుచున్న
దేనిలో నేది యిమిడి శాం ♦ తింపఁ గలదు.

నారదుఁడు — (ప్రవేశించి) దేవదేవులారా! కర్మసాక్షియగు లోక

మాండవ్యుని యొక్క శాపవశమున పదునాలుగు భువనములును, అనంతకోటి జీవరాశులును తల్లడిల్లి పోవుచున్నవి. దేవతలు నిర్విణ్ణులై పోయినారు. లోకము లన్నియును చల్లారిపోయినవి. ఇంకను మీరూరకుంటిరేల?

రుద్రు. — నారదా! ఇంక కేమి కర్తవ్యము?

నార — మీరిట్లు మీనమేషములు లెక్కించుచుండిన కార్యములేదు.

చం. కల దొక సాధ్వి యత్రిముని ♦ కాంత సముజ్జ్వల కాంతిపూత ని
ర్మలమతి, సాధుశీల, గుణ ♦ రాశి తపస్విని పుణ్యసీమ కో
మలి, యనసూయ, సూనృత స ♦ మంజసభాషిణి వేడినేని యీ
విలయము వాయు భానుఁ డుడు ♦ వీధి వెలుంగును గర్మసాక్షియై.

విష్ణు — నారదా! గంగావిషయమునఁగూడ నీవిట్లే ఖడ్గవాదము చేసితివి.

నార — అగును. మీరెవ్వరివలనఁగూడఁ గాని యామె శాపవిమోచన మా యనసూయ ఆలోకన మాత్రముననఁ గావించిన దింతకన్న నేమి గావలయును! మీమాటలు మీరే యుపసంహరించుకొనవలసి వచ్చునని నే నానాఁ డనలేదా?

బ్రహ్మ — అగును.

రుద్రు — సరే! ఆ యనసూయాదేవిని ప్రార్థింతము రండు.

ఉ. ఓ యనసూయ! సాధ్వి విమ ♦ లోజ్జ్వల చారుకళాకలాప తే
జోయుత సచ్చరిత్ర గుణ ♦ శోభిత నర్మదశాపసంహతిన్
ఆ యినుఁ డంతరించెను న ♦ జాండము చీకటివారెఁ గర్మముల్
పోయెను జీవజాలములు ♦ పోయెను దేవి సముద్ధరింపవే.

(అత్రి అనసూయలు ప్రవేశింతురు)

దేవదేవులారా! నమస్కారములు.

త్రిమూర్తులు — శుభం భవతు.

విష్ణు —

ఉ. ఓయనసూయసాధ్వి విమ ♦ లోజ్వల చారుకథాకలాప తే
జోయుత సచ్చరిత్ర గుణ ♦ శోభిత నర్మదశాపసంహృతిన్
ఆయినఁ డంకరించెను న ♦ జాండము చీకటివారెఁ గర్మముల్
పోయెను జీవజాలములు ♦ పోయెను దేవి సముద్ధరింపవే.

అనసూయ — మహనీయులైన మీవలనఁ గాని కార్యము సాధింప నేనెంతదానను?

అత్రి — ఈనర్మద యెంత ధన్యురాలు!

తే. గీ. దేవలోకంబు తపసుచేఁ ♦ బోవకున్న
దేవతలనెల్ల సాధ్వియై ♦ దింపె నేల
కీపతివ్రత నర్మద ♦ కెవ్వరీడు
భానుఁడుదయింపఁడే దేవి ♦ యానవలన.

రుద్రు — అనసూయా! నీవు తడవు సేయువలదు.

బ్రహ్మ — ఈనర్మదశాప ముపసంహరించుట కీవే సమర్థురాలవు.

అన — మీయాదేశము శిరసావహించుచున్నాను. నర్మదా!

నర్మ — అనసూయా! నమస్కారము.

అన — కల్యాణివి కమ్మా, నర్మదా! యీ లోకేశ్వరులైన దేవతలందరు నీయాన నుపసంహరింప ప్రార్థించుచున్నారు.

నర్మ — అగును.

తే. గీ. విబుధు లిటువచ్చి వేడిన ♦ వేఁడవచ్చు
భువనములు చెడిపోయినఁ ♦ బోవవచ్చు
జనులు చీకటిఁ జచ్చినఁ ♦ జావవచ్చుఁ
గాని నాపతి ప్రాణంబు ♦ పోవరాదు.

అన — సోదరీ! నర్మదా! నీ పతిప్రాణము కాపాడుటకు నే నవ్వా...

హస్త మిడుచున్నాను, నీవు నీయూన నుపసంహరించుము.

నర్మ — సరే, అట్లే సేయుదును.

(చేతులు మోడ్చి,)

తే. గీ. జగములకు కర్మముల కెల్ల ♦ సాక్షివీవు
తమ్ములకు, లోకములకు, బాం ♦ ధవుఁడ వీవు
అట్టి నినుఁ దిట్టి పాపంబు ♦ గట్టుకొంటి
నినుఁడ! నా మొఱ విని యుద ♦ యింపవయ్య.

(సూర్యుఁ డుదయించును. దేవతలు అర్ఘ్యము లిచ్చెదరు.)

ఉ. ఓ సరసీరుహాప్త! యున ♦ లోజ్జ్వల తేజ జగత్త్రయైక మి
త్రా సురలోకచైత్ర భవ ♦ దాగమనంబున జీవకోటి సం
త్రాసము వాసెఁ గర్మ పము ♦ దాయము దక్కె నిశాపిశాచ ము
ద్వాసము నొందె రాక్షస ని ♦ వాసము డిందె నమో విభాకరా.

ఖైర — హా! దేవీ,

తే. గీ. ప్రాణములు పోవుచున్న వ ♦ య్యయ్యొ యింక,
నేమి సేయుదు నెవ్వరి ♦ నేఁదలంతు;
నర్మదా! యొంటి నుందువే ♦ నన్ను వీడి,
మొండి నా జన్మ మూణ్ణాళ్ళ ♦ ముచ్చటయ్యె.

(అని ప్రాణములు విడుచును)

నర్మ — హా! నాథా నాథా!

సీ. నిను బాసి యెఱుఁగను ♦ నీతోడిదే లోక
మని మనంబున నెంచు ♦ కొనుచునుంటి,
నీయూన దాటక ♦ నీపాదసేవయే,
మోక్షదాయకమని, ♦ మ్రొక్కుచుంటి,

పతివ్రతైన గురువైనఁ ♦ బరమేశ్వరుండైన,
సేవ యంచును మది ♦ నెంచుచుంటి,
నాపెన్నిధానంబు ♦ నాపుణ్యఫలము నా
యాత్మతేజంబని ♦ యలరుచుంటి,
తే. గీ. అట్టి నిను జంపుకొంటి నా ♦ యంత నేనె
పాపముల బండికిని గూడు ♦ వైచుకొంటి
హతవిధీ! నాకు వైధవ్య ♦ మబ్బఁజేసి
తృప్తినొందితె యిటుల నే ♦ నేడ్చుచుండ.

అన — తల్లీ నర్మదా! యేల వగచెద వమ్మా! ఊరడిల్లుము. నీ ప్రాణేశ్వరున కేమియు హానిలేదు.

నర్మ — సోదరీ! యింకను హాని లేదనుచుంటివా! అయ్యో! సూర్యుఁడుదయించుటతోడనే నాభర్త యసువు లంతరించిపోయినవి. ఆబ్రాహ్మణ మునిశాప మమోఘము. ఇంక నాకెక్కడి శాంతి, యెక్కడి యూరట! హా! హతవిధీ! (అని మూర్ఛిల్లును)

అన — నర్మదా! వగవవలదు.

రుద్రు — ఆహా! యీ యనసూయ మహాత్వ మద్వితీయము. అనుపమానము.

విష్ణు — దేవతలవలనఁగూడ సాధ్యముకాని కార్యము మీ యనసూయ తృణప్రాయముగఁ జేసివేయుచున్నది. మహాపతివ్రతలకుఁ గాని కార్య మేమున్నది.

బ్రహ్మ — అగును.

రుద్రు — నేఁడీమెచేసిన మహోపకారమునకు మన మచ్చెరు వంద వలయునుగదా!

నార — మన మీమె నేమని కొనియాడఁగలము. (అని అందఱు కలసి, )

ఉ. ఓయనసూయ నీదు మహి ♦ మోజ్జ్వల తేజము, కీర్తి దిక్కులన్
మ్రోయుచునున్నది సతి త్రి ♦ మూర్తులు నైతము నిన్ను బోల రే
కీయెడ మీన మేషముల ♦ నెంచుచు నుండిరి పతివ్రతా
ప్రాయికమైన శక్తినిఁ బ్ర ♦ పంచము చాటఁగఁ జేసి తంగనా!

(అని పూలు గురియుదురు)

అన — దేవతలారా! యిదియంతయు మీయాశీర్వాద ప్రభావము.

దేవ — నీసౌజన్యత ప్రశంసనీయము. నీకేది కావలయునో కోరుము. మేము వరమిచ్చెదము.

అన — మహాభాగ్యము.

తే. గీ. బడుగు ముక్కాలి ముసలివాఁ ♦ డడుగు మోప
లేని రోగి, మానర్మద ♦ ప్రాణవిభుఁడు
ప్రాణములు వాసె సూర్యుని ♦ రాకవలనఁ
గాన బ్రతికించి పుణ్యంబు ♦ గట్టుకొనుఁడు.

దేవ — రుజాగ్రస్తమై చివికిన జీర్ణశరీరముతో మరణించిన యీ నర్మదా వల్లభుఁడు సువర్ణశరీరుఁడై బ్రతికి లేచునుగాక!

ఆకాశవాణి — "తథాస్తు"

భైరవుఁడు — "లేచును"

[తెరపడును]

రంగము — ఏటిరేవు.

(అత్రి అనసూయలు ప్రవేశించి యుందురు)

అత్రి — దేవీ! యీనర్మద యేత్రైపోయిన దేమి?

అన — సూర్యోదయానంతరము భైరవుఁడు సజీవుఁడైన తోడనే తనకు నదీరూపము ప్రసాదింపు మని నర్మద కోరినది.

అత్రి — నీవు చేసివేసినావు, ఆహా! యీమె నాభైరవ పాతకుఁ డెన్ని బాధలు పెట్టినాఁడు.

అన — సాధ్వియై యోర్చుకొన్నది. కావుననే,

ఆ. గీ. తపముఁ జేసి దేవ ♦ తల గెల్వలేకున్న
వరపతివ్రత యయి ♦ సురల నెల్ల
నేల దింపె; రవిని ♦ గాలాడనీయుతే
దమృతపేటి నర్మ ♦ దావధూటి.

అత్రి — ఈమె ధన్యురాలు.

తే. గీ. దుష్టుఁ డగు భర్త కోపాగ్ని ♦ దూలి మిడుత
కైవడిని మాడి మాడి దుః ♦ ఖములచేతఁ
జివికి చివికి విశీర్ణయై ♦ జీవములను
బాయు సతులెల్ల నేఱులై ♦ పారుచుంద్రు.

ఆరూపముననైన, గొంత యుపశాంతి గలుగునని —

తే. గీ. జన్మము తరింప నీ ప్రపం ♦ చకమునందు
స్వర్గమునుమించు పుణ్యాప్ర ♦ వంతి వగుచు
నెందఱినో పూతులుగఁజేయు ♦ దిద్ధచరిత
నర్మదా! నీవు మిగుల ధ ♦ న్యవుగదమ్మ.

గంగ — (ప్రవేశించి)

తే. గీ. అమరు లొనరింపలేని కా ♦ ర్యములు మనుజ
వనితలు మహాపతివ్రతా ♦ త్వమునఁ జేయఁ
గలుగుచున్నారు నాకట్టి ♦ గతి లభింప
కార్తనై పాపదేవత ♦ కగ్గమైతి.

అనసూయా వరప్రభావమున నర్మద నదీరూపమున మారిపోయినది. నారదుని యాదేశానుసారము నేనును ఆ యనసూయనే యాశ్రయించెదను. ఆమెజాడ యీ సమీపముననున్న వారి నడిగెదను. (అత్రి యనసూయలను సమీపించి) ఆర్యులారా!

చం. అడుగుట తప్పుగాని యెడ ♦ నద్భుతమయ్యెడు మీర లెవ్వరో
నుడువుఁడు మ్రొక్కెదానను మ ♦ నో హరరూపము మాటుజేసిన
ట్టడవిఁ బురాణదంపతుల ♦ యట్టులఁ దోఁచెద రార్యులార! నా
యెడ దయయున్న, సాధ్వి పర ♦ మేశ్వరి యాయనసూయఁజూపరే.

అత్రి — ఆహా! ఈమె గంగాదేవి, మనపై కరుణచే మరల ప్రసన్నమైనది.

అన — అమ్మా! గంగా! నీవు మమ్మెఱుఁగవా, నీవు మమ్ముద్ధరించిన దానవే గదా!

గంగ — అగును. మీ కులగోత్ర నామముల నేనెఱుంగక పృచ్ఛఁ జేసితిని, పొరపాటున్న మన్నింపుఁడు.

అత్రి — మహనీయవైన నీకుఁ బొరపాటేమింటి?

అన — సర్వజ్ఞవును సర్వశక్తి స్వరూపవును సర్వాంతర్యామిని వైన నీకుఁ దెలియని దేముండును.

గంగ — ఆ మహాసాధ్వి శ్రీ యనసూయను సందర్శించి నాపాప పరిత్యాగము గావించుకొనుటకుఁ గోరుచున్నాను. మీ రెఱింగితిరేని నాకగపరచి పుణ్యము గట్టుకొనుఁడు.

సీ. ఏ సాధ్వి తననిజ ♦ వాసంబు నలిసేవ
చే నమరావతి ♦ జేసెనొక్కొ
యే పుణ్యసతి తన ♦ రూపంబు గౌరీరూపు
లోఁ జూచి యానంద ♦ లోలయగునొ
యే సాధుశీల వి ♦ ద్యాసముల్లాసయై
యధ్యాత్మ తత్త్వంబు ♦ నందె నొక్కొ
యే సతీమణిమౌళి ♦ యిద్ధసద్గుణముల
కాణాచియై ప్రేమ ♦ గలిపెనొక్కొ

ఆ. వె. ఏమనోహరాంగి ♦ యీరేడుజగములఁ
దపముచేత వన్నెఁ ♦ దాల్చెనొక్కొ
అట్టి యత్రిజాయ ♦ అనసూయ అనసూయ
గొలువఁ గలుమచయము ♦ తొలఁగుఁగాదె!

అత్రి — ఈమెయే అనసూయ.

గంగ — ఆహా! నేనెంత ధన్యురాలను. అత్రి అనసూయుల నొక్క ప్రదేశమునఁ జూడగంటిని. తల్లీ! అనసూయా! నమస్కారము.

అన — పాట.

భవభయ వికారసంహారిణి నుతగీర్వాణీ, భజతే భాగీరథీ ॥భవ॥
శివుని శిరోపరి చూడాతలమున, నిరంతరము బస
నురాంతకుని పద కమలము జన్మవసుంధర నీకో
సజలవాసినీ నిరతభాసినీ ॥భవ॥

గంగ — పాట

నిను గనుఁగొంటిని నాపాపంబుల
శమించినవి శుభ సినుజ్జ్వలాంగీ!
సతివగు నీవనసూయవు గావా

కలుషనాశిని కళావాసినీ
భవభయవికార సంహారిణి మతగీర్వాణీ,
భజతే సాధ్వీమణీ ॥భవ॥

అన — అమ్మా! భాగీరథీ! నీఋణము మేమెట్లు తీర్చుకొనఁగలము? కేవలము నాభర్తృశాప ప్రభావ మహత్త్వమునకోర్వలేక మిక్కిలి దాహార్తులమై నీళ్ళకై నానాదేశ గిరిదరీకటకంబు లన్నియు వెదకి తుద కుదకకణంబులు గానక ప్రాయోపవిష్టులమై పరమదౌర్భాగ్యమైన మరణమునకుఁ బాల్పడనుండ నీవు నీనిర్వ్యాజ కరుణాకటాక్షమున మాకుఁ బ్రసన్నవై కాపాడితివి. మాజనపదంబు లన్నియు రక్షింపఁబడినవి. తల్లీ! నీవు మాకెల్లరకు జీవనదాత్రివి. నీఋణము మే మెట్లు చెల్లింపఁగలమో చెప్పుము.

గంగ — దేవీ! అనసూయమ్మా నాయుదంత మాలకించి నాపాపవిమోచనము గావింపుము.

తే. గీ. శంతను సమాగమమున సుత ♦ సప్తకంబు
నల కృతాంతాశ్రయంబున ♦ కంపినట్టి
పాప మీరూపమున నన్ను ♦ రూపడంచు.

పాప — హుం.

గంగ — హా హతోస్మి. “వెంటఁ బోయెదు క్రీనీడ ♦ విధముదోప” సోదరీ! అనసూయా! లజ్జావనతవదననై న నాదుశ్చరితమేమని చెప్పనోపుదును. (పై పద్యమును చదివి) ఈపాపోపశమనార్థము త్రిలోకంబులు తిరిగి త్రిమూర్తులవేఁడి త్రిపథగామినినై తుదకు గతిగానక హతాశనై వేగి నారదోపదేశమున నీదర్శనార్థ మేతెంచితిని. తల్లీ! నాపాప ముపశమింపఁ జేయుము. (అని కాళ్ళపైఁ బడును).

అన — (లేపి) అమ్మా! నీవు మాప్రాణదాతవు. కాక, అఘోఘనాశినివైన లోకమాతవు. నీకు పాపకళంక మెట్లు సోకఁగలదు. అది కేవలా

భాసము. ఓపాడు పాపదేవతా! నీవు తొలఁగిపొమ్ము. (అని మంత్రోదకము జల్లును. పెద్దమంట లేచి దేవత కాలిపోవును.)

గంగ — నేనెంతధన్యురాలను. రక్తాక్షియు రక్తస్వరూపిణియు రక్తావలేపనావిలవికారయు నగు నాపాపదేవతతొలఁగినది. అనసూయా! నీపాతివ్రత్యమాహాత్మ్యము త్రిలోకపూజ్యము. అనన్యసామాన్యము. అనుపమానము.

తే. గీ. మూఁడుమూర్తులు ముల్లోక ♦ ములకు విభులు
దీర్పలేనట్టి కార్యంబుఁ ♦ దీర్చినావు
వీరపతివ్రతలకు సాధ్య ♦ పడనిదేది
అంబ! జోహారు నీరాజ ♦ నంబులివిగో.

గంగ చెలికత్తె లెల్లరును ఆకసమునుండి దిగివచ్చి పైపద్యము చదివి (హారతి పట్టుదురు)

గంగ — (పాట)

ప్రేమకుసుమాంజలిని గొమ్మిదె హారతీ
పాపముక్తనయి ధన్యురాలనయి మ్రొక్కుదాన నా ॥ప్రే॥

గంగ — సోదరీ, అనసూయా! ముందెట్టి దోషదేవతలును సోకకుండ నాకేదేని తాయెత్తు నొసంగవమ్మ.

అన — అమ్మా! గంగా! నీవు సకలదోష పరిహారిణివి. సకలపాప సంహారిణివి, సకల తాపోపశాంతి సాధనమవు. నీకు నే నేమిచ్చిన నీఋణము దీర్పఁగలను. అయినను నీవడిగితివి గావున,

తే. గీ. పొలఁతుల నుదుటఁ గస్తూరి ♦ బొట్టు దృష్టి
దోషములఁ బాపుగతి జల ♦ దోషములను
నిండుగ ఫలంబు బాపుచు ♦ నుండు సతము
ఇదియె తాయెతు మెడ ధరి ♦ యింపవమ్మ!

(అని యిచ్చును)

గంగ — మహాప్రసాదము. (అని తీసికొనును)

పాపదేవత — హా! అనసూయా! ఎంతపనిజేసితివి.

మ. చిరకాలంబును గంగవెంటఁబడి మా ♦ చిత్తంబు రంజిల్ల దు
ష్కర దుర్వార దురాగతంబయిన దో ♦ షజ్వాలలోముంచి రూ
పరఁగావించితి మట్టి మా కడుఁగుసం ♦ ప్రాప్తించె నాయిందుగఱ
అరితోడమ్మో నికేది దారి యనసూ ♦ యా శాపబాణాగ్నికిన్.

అన — ఓదేవతా! నీవు వగవఁ బనిలేదు. ఈ గంగా పుష్కర ప్రవేశమున నిన్ను ముక్కోటిదేవతలు ముప్పదిమూడుకోట్ల భారతీయులు నరసురాసుర యక్ష కిన్నరాదులతోఁగూడ నీనామస్మరణము సేయఁగలరు. లెమ్ము! పొమ్ము.

దేవకన్యలు — గంగా! నీవు లేని దేవలోకము పాడువడి యున్నది.

గంగ — ఈ యనసూయా దయాదృష్టిని తిరిగి మిమ్ము నేను కలిసికొను భాగ్యము సంఘటించినది.

తే. గీ. మూఁడుమూర్తుల యిల్లాండ్రు ♦ మూడులోక
ములకు తల్లులౌ వారికి ♦ నలవిగాని
పాపసంహార మొకతృణ ♦ ప్రాయమట్లు
జేసె ననసూయ సామాన్య ♦ స్త్రీయె తలఁప.

దేవకన్యలు — కాదు. ఈమె మహాపతివ్రతా తిలకము. ఈమెకును తక్కిన సతీలోకమునకును చాల తారతమ్యము గలదు.

తే. గీ. శాంబరీభిల్లు పాశుప ♦ తంబు వాడి,
కానఁ బసులకాపరి ములు ♦ గఱ్ఱవాడి
లోనభేదంబె పడఁతుల ♦ లోనఁగలదు
రాయి రత్నంబు నొకటన ♦ రాదుగాదె!

గంగ — అమ్మా! అనసూయా! నీయిష్టార్థములన్నియు ఫలించును గాక. నీకెవరివల్లను నాపాతము సంఘటిల్లదు. నీవఖిలజగంబులకుఁ దల్లివి కాఁగలవు. మీ యాశ్రమసమీపమున నేనెల్లకాలము జలస్వరూపనై సేవించెదను. (అని ముద్దిడును. దేవతలు పూలు వర్షింతురు.)

అందఱును — మహనీయులగు నోదంపతులారా! నమస్కారము.

(అని విమానమునెక్కి వెళ్ళిపోవుదురు.)

అత్రి — దేవీ! జలావగాహనమున నీవనప్రకృతి యెంత విచిత్రముగా మాఱిపోయినదో చూచితివా?

అన — ఒక్కవనమేమి, జగత్ప్రకృతియే మారిపోయినది.

అత్రి — అగును.

చం. జగమును మార్చివేయఁగల ♦ చందమయూఖము లెల్ల జల్లనై
నెగడెను; సాంధ్యరాగములు ♦ నింగినిఁబర్వె దినాంత వేళలన్
దగిన విలాససూచన ల ♦ నంతము దోఁచెను, మేఘపంక్తులన్
గగనముఁ గ్రమ్మె నెమ్మియది ♦ గాంచుమ మనాడెముఁ జూడుముంగఁగా!

[తెరపడును]

# పంచమాంకము

రంగము — అత్ర్యాశ్రమము

(అత్రి అనసూయలు ప్రవేశించియుందురు. అత్రి తపము చేయుచుండును; అనసూయ రాటము వడకుచుండును.)

అన — ఆహా!

తే.గీ. పెద్దకాలంబు తపము గా ♦ వించుచున్నఁ
గర్మబంధాలు తెగెడుమా ♦ ర్గంబె తోఁచ
దలత్రిమూర్తులు వచ్చి ప్ర ♦ త్యక్షమైనఁ
దలఁపు విడిపోయి సద్గతి ♦ గలుగు నేమొ.

(త్రిమూర్తులు బ్రాహ్మణవేషములతో బ్రవేశించుదురు)

బ్రహ్మ — ఇదే మహర్షి అత్ర్యాశ్రమప్రాంతకాంతారము.

విష్ణు — ఆహా! యెంత సొగసై విరాజిల్లుచున్నది.

ఉ. పాఱెడునేళ్ళు పచ్చికలఁ ♦ బండిన లేళ్ళును చెట్లనుండి సొం
పారెడుపండ్లు పూపొదలఁ ♦ బక్షులగూండ్లు వెలార్చువిశ్వసం
సారము నైంద్రజాలికుఁడు ♦ చక్కఁగ నొక్కెడ జూపురీతి నొ
ప్పారెడు నీవనంబు కడు ♦ బావనులన్ బొనరించు నెల్లరన్.

రుద్రు — అగునగును.

ఉ. అత్రి విశాలతత్త్వవిమఁ ♦ డైనను నీయనసూయ వానికిన్
క్షేత్రముగా లభించుట ప ♦ సిండికిఁ దావిలభించినట్లు లో
కత్రయపూర్ణకీర్తియును వి ♦ కాసము గల్గె రసంబుకాంతితో
మైత్రిఘటించె నిచ్చట ప ♦ మన్త్రకళాకలితప్రకాండమై.

బ్రహ్మ — మనబ్రాహ్మణవేషములు సమర్థనీయములే గదా?

రుద్రు — సహజవైదికుఁడవైన నీకాయిబ్బంది లేదు.

బ్రహ్మ — నీకుమాత్ర మేమిలోటున్నది?

ఉ. అక్షరమూర్తి మన్మథుని ♦ నాహుతి జేసినభూతిరాశి రు
ద్రాక్షలు వేసి వాసిచెడ ♦ దండకమండలధారివై తపో
దీక్షను వల్లకాడులను ♦ ద్రిమ్మరు నీవు స్వభావసిద్ధుఁడౌ
భిక్షుఁడవే వినూత్నమగు ♦ వేషముగాదిది నీకు శంకరా!

విష్ణు — అగునగును.

రుద్రు — కేశవా! నీవును, ఒకప్పుడు బ్రాహ్మణుఁడవే!

తే.గీ. అదితికశ్యపులకు ద్విజుఁ ♦ డై జనించి
బిక్షమడుగఁగఁబోయిన ♦ విధమునీకు
జ్ఞప్తియందుండవచ్చునా ♦ నాఁటిరూపు
వాసనావేశితంబయి ♦ వచ్చెనిపుడు.

బ్రహ్మ — అదిగో! మననారదుఁడు వచ్చుచున్నాఁడు.

నార — (ప్రవేశించి) త్రిమూర్తులగు మీకు నమస్కారములు.

త్రి — నీకు శుభమగునుగాక!

నార — ధన్యోఽస్మి.

తే. గీ. వాయువువిధానఁ గలదు మీ ♦ వాసమఖిల
దిశల రవివలెఁ గలదు మీ ♦ తేజమవని
అన్ని మీయందె కలవు మీ ♦ రన్నిటఁ గల
రనఘులార నమోస్తు మ ♦ హాత్ములార!

విష్ణు — నారదా! నీరాక మాకు మిగుల శుభావహము.

నార — దేవతలారా! మీరెచ్చటి కేగుచున్నారు?

రుద్రు — అనసూయా పరీక్షార్థము.

నార — పాప మువశమించునుగాక.

బ్రహ్మ — ఏమి యట్లనుచున్నావు?

నార — మహాపతివ్రతలం బరీక్షించుటయన్న మహాదోష దూషిత మగు అకార్యముకాదా!

విష్ణు — కాదు.

నార — అట్లనుట గొప్పసాహసము.

రుద్రు — అదే యిప్పు డూహించుచున్నది.

ఆ. వె. ఒకతె రపిస యుడ్డె, ♦ నొక్కతె దిపిజగిం
గావధూటి శాప ♦ గతిని మాన్ప,
నింక దేవలోక ♦ మీ మర్త్యకాంతల
కాళ్ళధూళిచేతఁ ♦ గ్రాలవలసె.

చం. గగనముఁ జేల్పవచ్చుఁ జను ♦ గంగను బాయలుసేయవచ్చు నా
లుగు పదిలోకముల్ క్షణము ♦ లోపల గెల్వఁగవచ్చు వార్ధిలో
నగములఁ దేల్పవచ్చుఁ గుల ♦ నాగము లెత్తగవచ్చుఁగాని యా
నుగుణ పతివ్రతామణుల ♦ జోలికిఁ బోవఁగ రాదు భ్రాంతులై.

విష్ణు — నారదా! మా కసాధ్యము లున్నవా.

మ. మునులంచున్,మహనీయమూర్తులని మా♦ మ్రోలన్ బ్రగల్భంబు లా
డిన రంభాదుల నంపి వారల నొగిన్ ♦ డిందింపమో యట్లె యీ
వనితన్ సాధ్విఁ బరీక్షచేయుటకుఁ బో ♦ వంజెల్లదే మాకు వ
హ్నిని బంగారము ముచ్చిమో కరఁగికా♦దే చూతురత్యంతమున్.

నార — స్త్రీలవిషయము. వారిని పరీక్షించు టనునదియే ప్రమాదము, పతివ్రతలగు సాధ్వీమణులుండిరన్న వారిని మన మెంతయుఁ గొనియాడవలయును. పోయి సంవిధానము సేయవలెను.

రుద్రు — అనఁగా?

నార — ఎఱిఁగియుండి నన్నడుగుదు రేల?

తే. గీ. అతిపయోర్త బ్రహ్మాదుల ♦ కలవిగాని
పను లొనర్చఁగఁ బూజింప ♦ వాయుఁగాదె
యింటిపైఁ బాలు పూచిన ♦ పిండివారి
యాకుఁ దొడిఁగిన నివ్వెర ♦ గందవలదె.

విష్ణు — కావుననే పరీక్షింప నూహించుచుంటిమి.

నార — వల దది ప్రమాదము. మఱచితివా. నర్మద సూర్యు నుదయింపకుండ నరికట్టినది. అప్పుడు మీ రేమైనఁ జేయఁగలిగితిరా!

తే. గీ. సిగురుగల నిప్పుపై సీఁగ ♦ లెగురఁగలవె
భానుబింబముపైఁ జెద ♦ పట్టఁగలదె
అట్టి లా సాధ్వి యనసూయ ♦ నంట నెవరి
తరము వృత్స్యాత్ర మేరువు ♦ దాకినట్లు.

బ్రహ్మ — నారదా! నీవు మర్యాద నతిక్రమించి మాటాడు చున్నావు. చూడుము నిన్నొక త్రుటిలో మాడ్చివేయుదుము.

నార — అగును. నన్ను మాడ్చి వేయుట సులభమేగాని అన సూయా విషయ మట్టిదిగాదు. గంగాశాపవిమోచన సందర్భమునను, నర్మద ప్రాణేశ్వరుని సందర్భమునను ననసూయ మహాత్త్వ మెఱిఁగి యుండి పొరపడ నగునా?

తే. గీ. పదపుటింటి సూర్యుని దూర్పు ♦ పడమ నైన
ద్రిప్పవచ్చునుగాని యే ♦ ద్రిప్పలు పడి
అత్రిమునిజాయ ననసూయ ♦ నంటలేరు
కడకు భగ్నాశులై పోవఁ ♦ గలరు మీరు.

రుద్ర — ఈతఁడు మున్నొకప్పుడిట్లే మాతో వాదించినాఁడు.

బ్రహ్మ — ఈతఁ డొక పాషండవాదిమూర్ఖుఁడు.

విష్ణు — మద్భక్తుండైనను కలహాభోజనుండైన నారదుని యహితాలాపములు త్రుంచిన్యములు గావు.

నార — (స్వ) ఇది యేకో ప్రసాదమునకే వచ్చినది. (ప్ర) దేవదేవులారా! దానవులు మీకు కటువైనను నేనింతవఱకు వీరిడిన్నా భయంబు దక్కి వచింపిసందుకు మన్నింపుడు. కాని,

శా. సీతన్ బట్టిన రావణుండు, శచి రా ♦ జీనాక్షి పంపించి దు
ర్నీతుండైన నహుషుండు; దేవి దమయం ♦ తిన్ గోరి బోయండప
ఖ్యాతిన్ భీతిని ద్రుంచినట్టు లనసూ ♦ యన్ డాసి పూరీపయిన్
వీతజ్ఞానులు కాఁదలంపకుఁడి నా ♦ విజ్ఞప్తి నాలింపుఁడీ.

(అని నిష్క్రమించును.)

అత్రి — (తపస్సునుండి లేచి) దేవీ! అక్కడ నెవ్వరో అతిథులు వచ్చి వేచియున్నట్టు లున్నది. మనము పోయి సంవిధానము చేసి తీసికొనివచ్చెదము రమ్ము.

అన — మహాభాగ్యము. తమ తపస్సు ఫలించి ప్రత్యక్షమైన త్రిమూర్తులవలె నున్నవారి నవశ్యము మనము సన్మానింపవలయును.

(అని వెళ్లుదురు)

త్రిమూ — అత్రి, అనసూయ యిూవంకకే వచ్చుచున్నారు.

అత్రి — మహనీయులగు భూదేవతలారా! నమస్కారము. నేఁడు మాకుటీరమున నిలిచి మాయొసంగు నాతిథ్యమును స్వీకరించి మమ్ము తరింపజేయఁ బ్రార్థించుచున్నాము.

రుద్ర — పూజ్యులారా! మీనామధేయము లేమి?

అత్రి — నా పేరు అత్రి. ఈయమ నాభార్య అనసూయ. ఇది మా యాశ్రమము.

విష్ణు — ఓహో! జగత్ప్రసిద్ధ చరిత్రులైన మిమ్ము దర్శించి తరించితిమి.

బ్రహ్మ — మీరు లోకత్రయ పూజ్యులు; మహానుభావులు.

రుద్రు — అగును.

అత్రి — ఆర్యులారా! భిక్షకుఁ బ్రొద్దు పోయినది. వేగిరము లెండు పోవుదము.

బ్రహ్మ — మేమిదివఱ కెవ్వరియింటను గొనవియుండలేదు.

రుద్రు — మాకాచారము మెండు.

విష్ణు — సామాన్య సూనవ మాత్రులు మమ్ము సంతృప్తులను జేయఁ జాలరు.

అత్రి — పూజ్యులారా! నన్ననుగ్రహింపుఁడు. నా శక్తివంచనయు లేకుండ మీకాతిథ్య మిచ్చి పూజించెదను.

బ్రహ్మ — దుర్లభమైన యిట్టిపనికి సాహసింపకుము.

రుద్రు — ఆవల నోడిపోవలసి వచ్చును.

విష్ణు — తుదకు మాపని అధ్వాన్నమగును.

అత్రి — అట్లాసతీయవలదు.

బ్రహ్మ — మాకేమి నమ్మకము.

రుద్రు — తప్పక ఆతిథ్య మిచ్చెద నని శపథము సేయుము.

విష్ణు — నీవేకాదు నీయర్ధాంగికూడఁ జేయవలయును.

అత్రి — అవశ్యము:—

చం. విధులునశించినన్ గులము ♦ వీడినఁ బ్రాహ్మ్యముపోయినన్ సదా
మధురగుణప్రయుక్త కుల ♦ మానిని యీయనసూయ బాసినన్
బుధజనులార నేనతిథి ♦ పూజను వీడను నమ్ముడింక నా
విధుఁడు త్రిమూర్తు లరుగుఁడును♦విశ్వము సాక్షులుగాగ నివ్వెడన్.

బ్రహ్మ — శహభాస్ అత్రి! నీవొక్కఁడవె కార్యశూరుఁడవు.

రుద్రు — తథ్యము!

విష్ణు — ఈయనసూయ మాయతిథ్యము సక్రమముగ నెఱవేర్చుట కంగీకరించినదా?

బ్రహ్మ — మహాపతివ్రతగదా! పతిపలుకున కెదురాడఁగలదా!

రుద్రు — అనసూయా! యేమి మాటాడవు?

అన — ఆర్యులారా! మీరింతగా తరచనేల. మాకుఁ గలిగిన కలియో గంజియో సమర్పించెదము. మీదర్శనమగుటయే మహాభాగ్యమని యువ్విళులూరు మాయింట నేడు భుజించి మమ్ము పవిత్రులను జేయుడు. మీకిదే మ్రొక్కుచున్నాను. లెండు భోజనమునకుఁ బ్రొద్దెక్కుచున్నది.

విష్ణు — సరే. మాశీలము తప్పకుండ నీవన్నము వడ్డించెదవేని మేమవశ్యము మీయాతిథ్య మంగీకరించెదము. లేదా యిదే వెళ్ళిపోయెదము.

అన — మహాత్ములారా! మమ్మింక విషమపరీక్షలు సేయకుఁడు. మీమ్రోల నిదే నాప్రాణేశ్వరునివలెనే నేనును శపథముసేయుచున్నాను.

ఉ. ప్రాణము పోయినన్ వ్రతము ♦ బాసిన, నీసిరులెల్ల విఘ్నమై
దీనత వచ్చినన్ బ్రజలు ♦ దిట్టిన సత్కులమెల్ల మాసినన్
మానను విందు చేసి మిము ♦ మాన్యులఁ బూజయొనర్చి పంపెదన్
భానుఁడు నాత్రిమూర్తులు ♦ ప్రపంచము సాక్షులు గాగ నిర్వ్యాడన్.

ఆకాశవాణి — తథాస్తు.

[తెరపడును]

---

రంగము — గృహారామము.

(అత్రి, అనసూయ, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు బ్రాహ్మణ వేషములతో ప్రవేశించి యుందురు.)

అన — నాథా! వడ్డన చేయుచున్నాను. అభ్యాగతులతో తాము భోజనమునకు లెండు.

అత్రి — అట్లే. పూజ్యులారా! వడ్డన యగుచున్నది. కాళ్ళు కడిగికొనుఁడు.

బ్రహ్మ — మేము స్నానాద్యనుష్ఠానములఁ దీర్చి సర్వసిద్ధముగ నున్నారము.

అత్రి — సరే, దయచేయుఁడు.

(అందఱు పీటలపై కూర్చుందురు.)

అన — (పళ్ళెముతో అన్నము తెచ్చి వడ్డింపఁబోవును.)

రుద్రు — మే మభోజనముగ లేచిపోయెదము.

అత్రి — అదియేమి భూసురులారా! నావలన నేమి యపరాధము జరిగినది ?

విష్ణు — వేరేయపరాధము కావలయునా, మాయెడ కంతరాయము వచ్చుటయే.

బ్రహ్మ — మా కిచ్చుట సంతయు ననాచారముగ నున్నది, మే మిప్పుడే లేచి పోయెదము.

అత్రి — అయ్యలారా! లేవ వలదు, అతిథుల కన్నము పెట్టలేదని నింద, ఈ మహాపాతకము నానెత్తిపై పడవేయకుఁడు. మీ యిష్టాను సారము మడిని నిర్వర్తించెదము.

రుద్రు — ఆడినమాట తప్పవలదు సుమా.

అత్రి — నేనెన్నఁడును అనృతమాడను.

విష్ణు — మా కుచితమైన మడితో మాకాతిథ్య మిచ్చువాఁడవేనా!

అత్రి — ఆసంగతి ముందే మీతో భాష చేసితిమిగదా.

రుద్రు — అగును.

బ్రహ్మ — సర్వజ్ఞురాలైన యీ యనసూయ,—

విష్ణు — మహాపతివ్రత యని పేరెన్నిక గన్న అనసూయ,—

రుద్రు — ఈ మలీమసమైన వస్త్రములతో మాకెట్లు అన్నము వడ్డింపవచ్చినది?

అత్రి — అవి మలినవస్త్రములు కావు. మడిబట్టలు.

బ్రహ్మ — మడిబట్ట లెట్లైనవి? సాలెవాని గంజిలో నాని చాకలివాని బానలో ముదిగి మురికినీళ్ళలో ముంచి మొత్తఁబడిన యావస్త్రము మడి యెట్లగును?

అత్రి — ఈ వస్త్రములు మే మిరువురము స్వయముగ రాట్నముపై నూలువడికి నేసి మడికై వాడుచున్నారము.

రుద్రు — ఏమి నీ ప్రౌఢవచోవిలసనములు, మారేడు కాయకు మసిఁ బూసి నేరేడుకాయ యనిన దాని యొరవనుబట్టి యైనఁ బోల్చుకొనలేనట్టి మందు లుండెదరా. యీబట్టలు నీవు నేసినవా, యివి యుతికిన దెవ్వరు?

అత్రి — అనసూయ.

విష్ణు — ఆనీళ్ళు చేప యెంగిలి సేయలేదా.

అత్రి — లేదు. దరిగర్భమునుండి వచ్చుచున్న గంగ.

బ్రహ్మ — అదిగో గంగయే శూద్రాంగన. ఆమె సంపర్కము మామడికి దోషావహము.

అత్రి — అటులైన ఈ యనసూయ వల్కలములు కట్టి వడ్డించును. తాము కూర్చుండుఁడు. నామనవి చెల్లించి పరిషేచనము పట్టుఁడు.

రుద్రు — ఏమి వల్కలములా, అవియును మాకు శుచియైనవి గావు.

అత్రి — సరే. యీ అజినాంబరంబులు ధరించి వడ్డించుచు లెండు.

విష్ణు — ఈ అజినములు జీవహింసాదోషజములు. మాంసము, శిరములు, కలుషపూరితములై దుర్గంధ సంయుక్తములై మలినములైన వీనిని ధరించి మా కీదిన మాతిథ్య మియ్య నూహించితివా సరే. అత్రీ! నీవు పైకి పిచ్చివానివలె నున్నను లోపల మిగుల గడుసరివలె నున్నాఁడవు.

బ్రహ్మ — అగును. ఇదియును మాకు మడి గానేరదు.

అత్రి — ఇంక నేమి కర్తవ్యము?

విష్ణు — కర్తవ్యమున కేమున్నది. మాదారిని మేము లేచి పోయెదము. నీవును నీయిల్లాలును హాయిగ నారగించి యానందముగ నుండుఁడు.

అత్రి — పూజ్యులారా! మిమ్ము భోజనులుగా నేను విడువనోపను. నా ప్రాణమైన దానము చేసి మీ యిష్టార్థముల నెఱవేర్చి యాతిథ్య మిచ్చి పంపెదను. వలదు. మీరు పోవలదు.

రుద్రు — అత్రీ! మమ్మేల వారించెదవు, విడువుము. నీవు మా కాతిథ్య మొసంగఁజాలవు. మేము మాదారిని లేచిపోయెదము.

విష్ణు — నీమూలమున మేమీదినము కటికి వస్తుండవలసి వచ్చినది.

రుద్రు — నీయడ్డులేకున్న నీపాటి కెందైన భిక్షకు కుదిరియుందుము. నీవన్యాయముగా మామార్గావరోధము గావించితివి.

బ్రహ్మ — ఈ పాతక మీతని నెత్తిపై పడవేసి పోవుదము రండు.

అన — భూసురులారా! మాయపరాధముల మన్నించి మీకేది వాడిరో విప్పిచెప్పి మాయాతిథ్యము స్వీకరించి మమ్ము చరితార్థులను జేయుఁడు. మీకిదె మ్రొక్కుచున్నారము. (అని యిరువురు కాళ్ళపైఁ బడుదురు.)

రుద్రుడు — మేమింక చెప్పునదేమున్నది. మాయాచారమున కతిథాయము రాకుండ నీవు నడపిన నీయింట హాయిగా విందారగించి యాశీర్వదించి పోయెదము. (బ్రహ్మనుజూపి)

సీ. నాల్గువేదము లొక్క ♦ నాఁడు పఠించిన
బ్రహ్మదేవుని యంత ♦ వాఁ డితండు;
(విష్ణునుజూపించి)
అవతారములు పది ♦ యవధరించిన మేటి
పద్మనాభుని యంత ♦ వాఁ డితండు;
బ్రహ్మ — (రుద్రునివైపుఁజూపి)
మరుని గాల్చియు మూఁడు ♦ పురములు గూల్చిన
భర్గదేవునివంటి ♦ వాఁ డితండు;
అనసూయ — (అత్రినిఁజూపి)
మూఁడుమూర్తులు వచ్చి ♦ మోమోట పెట్టిన
అనృతమాడని వాని ♦ యత్రి యితఁడు.

రుద్రుఁడు — అనసూయా! నీమగని నీవు, నిన్ను నీమగడును పొగడుటలో విశేషములేదు.

అత్రి — ఆర్యులారా! ఇట్లు మీరు మమ్ములు లెక్కించుటలో భోజనకాల మతిక్రమించుచున్నది. మీకేద్యది యిష్టమో నిర్ణయింపుఁడు. శిరసావహించి యాచరించెదము. లెండు మాపై కరుణింపుఁడు.

బ్రహ్మ — సరే! మాయిష్ట మడిగితివి గావున నిస్సంశయముగ చెప్పుచుంటిమి.

అత్రి — మహాభాగ్యము. చేయుట కవహితుఁడనై యున్నాను.

బ్రహ్మ — ఈయనసూయ దిగంబరయై మాకన్నము వడ్డింపవలయును. అటులైనఁగాని మాకు మడి కుదురనేరదు.

అత్రి — (చెవులు మూసికొని) శివశివా! యిది యెక్కడి మడి!

మ. తడిపట్టంబులొ వల్కలాజినములో ♦ ధౌతాంబరశ్రేణితో
మడికిన్ బెట్టుదు రంతెకాని యతిథుల్ ♦ మర్యాద పాటింప కీ
పడతిన్ జూచి వివస్త్రయై కుసుమలన్ ♦ వడ్డింపఁగా గోరఁ జొ
ప్పడునే స్పృహ్యానుశీలముల్ పతితమై ♦ పాపంబు రాకుండునే.

అన — ప్రాణేశ్వరా! నామూలమున మీరతిథుల నొవ్వ నాడ వలదు.

అత్రి — భూదేవతలారా!

తే. గీ. పతికి హిత మాచరించుటే ♦ పరమపదము
మోక్ష మని యెంచు ననసూయ ♦ పుణ్యశీల
ప్రాణ మిచ్చును గాని యీ ♦ మానహాని
కొడఁబడునె మీర లిటుగోర ♦ నుచితమయ్యె.

బ్రహ్మ — సాధ్యము కాదనుము. లేచిపోయెదము.

అన — నాథా! వలదు వలదు. మీరట్లు లతిథులను చెడనాడ వలదు. దాన ధర్మహాని సంఘటిల్లును. ధర్మమునకన్న మానప్రాణము లధికములు కావు.

అత్రి — దేవీ! అడవులఁబడి మృగప్రాయులమైన మనపై నీయతిథు లిట్లు కికురింపనగునా.

అన — మీరట్లు లానతీయవలదు. నే నీమహాపురుషుల యిష్టాను సార మాతిథ్య మిచ్చి పంపించెద నాఁడిల్లుఁడు.

అత్రి — దేవీ! నేనిందేమియు గర్తవ్య మూహింపలేకున్నాఁడను.

అన — త్రిమూర్తులవలె ప్రణవతేజముతో విరాజిల్లుచున్న యో మహానీయులారా! అత్రివంటి యీపేదవాని కుటీరమున మీరాతిథ్య మున కియ్యకొనుటయే మాకు మహాభాగ్యము. నేఁడు మాపుణ్యము

పండినది. మీరలు కోరిన కోర్కె మిక్కిలి సామాన్యమైనది. మీ యభిమతానుసారము నేను వివస్త్రనై యీవంటకము లన్నియు వడ్డించె దను. తామసహితులై భుజించి మమ్ము కృతార్థులను జేయుఁడు.

అత్రి — దేవీ! అంతపనియే (అని మూర్ఛిల్లును).

(ముగ్గురును పీటలపై కూర్చుందురు.)

అన — (చేతులు పైకెత్తి)

ఉ. ఓ సచరాచరాత్మక మ ♦ హోన్నత తేజ నిజప్రభావ దే
వా సదయాంతరంగ విప ♦ దబ్ధి మునింగిన వారిఁ బ్రోవ నీ
వే; సరి లేరు నీకు; నవి ♦ వేకులు నిన్ను గ్రహింపలేరు న
న్నీ సమయంబునన్ గరుణ, ♦ నేలుము మ్రొక్కెద నిన్ను దీననై.

(ప్రకృతి యంతయుఁ గోలాహలమై పిడుగులు రాలును. గంగా నర్మ దలు ప్రవేశించి) అనసూయ దీనాలాప శ్రవణమాత్రమున చతుర్దశ భువనము లన్నియు తల్లడిల్లుచున్నవి. (సమీపించి)

గంగ — అనసూయా! నీ పనికి నే నియ్యకొనెదను, నీవు బెగ్గ డిలకుము తల్లీ.

నర్మ — అక్కా! నేనుండఁగ నీకీశ్రమ యేల, నాకా కార్యము నియో గింపుము; నేను చేయుదును.

అన — తల్లీ వలదు, నేనే నిర్వర్తించెదను, వారివి బాలబిభీషికలు.

(అని నిమ్రక్కవించుదురు.)

త్రిమూర్తులు — హాతోస్మి. హాతోస్మి. హాతోస్మి.

(ముగ్గురు పసిపాపలై యేడ్చుచుందురు.)

గంగ — ఆహా! యేమి యీయనసూయ పాతివ్రత్య మాహాత్మ్యము! దుర్నయము నకు వచ్చిన త్రిమూర్తులును గూడ శిలఖములవలె మాఱి పోయిరి.

నర్మ — మన మాపెను వెన్నాడి పోవుదము రమ్ము,

(అని యిరువురు నిష్క్రమింతురు)

అన — (ప్రవేశించి) నాథా! లెండు.

అత్రి — (లేచును) దేవీ! అతిథులేరీ! యీ పాప లెవ్వరు?

అన — వారే వీరు. మనకు బిడ్డలులేని కొఱంత పరమేశ్వరుఁడీ రూపమునఁ దీర్చినాఁడు.

అత్రి — ఈ యుదంతమేమి?

అన — నాథా! నాకట్టు పుట్టములు విడిచి వడ్డన గైకొని రానుద్యోగించియుండ వీరు పసిపాపలై యేడ్చుచున్నారు.

ఆకాశవాణి — పతివ్రతలు లోకమాతలు, వారిని వివస్త్రలుగాఁ జూడఁ గోరువారు తల్లిని బిల్లలవలె పసిపాపలే కావలసి యుండును.

అన — నాథా! తొట్టె తెండు. నేను పాలిచ్చెదను.

అత్రి — (తొట్టె తెచ్చి చెట్టునకు వ్రేలాడ వేయును.)

నారదుఁడు — (ప్రవేశించి) అనసూయను వంచింపఁదలంచిన త్రిమూర్తుల వెదకుచు గౌరీ లక్ష్మీ సరస్వతులు వచ్చుచున్నారు, వారినిందుండి కొంతవడి వీక్షించెదగాక.

(గౌరీ లక్ష్మీ సరస్వతులు ప్రవేశింతురు.)

సరస్వతి —

ద్విపద। పతి యెటఁ జనెఁ గనఁ ✦ బడఁడది యేమొ
క్షితి వెదకితిమి వీ ✦ క్షింపఁగరాడు
వివగఁ బొగులుచు ✦ నెదిశఁజనెనో
వీ విపరీతము ✦ లేచెవిఁ బడునో

గౌరి:—

చం. పతు లెట కేఁగిరో తెలియ ♦ వచ్చుట లేదు జగత్త్రయంబునన్
బ్రతికితి మబ్జసంభవుఁడు ♦ వెన్నుఁడు నాపతిశంకరుండు మీ
క్షితి కిటు వచ్చిరో తెలియఁ ♦ జెప్పుఁడు కాననవాసులార మా
బ్రతుకుల కాసలేదు తెగి ♦ వచ్చిన మమ్ము ననుగ్రహింపరే.

లక్ష్మి — అనాథరక్షకుఁ డగు నావల్లభుఁ డెందేగియుండునో తెలియదు. ఇది మాయగానున్నది. నేనీవియోగము సహించి జీవింపఁజాలను.

ఉ. భానుఁడు గ్రుంగ దీపముల ♦ పైశలభంబులు రాలి వ్రేల్మిడిన్
ప్రాణము వాసినట్లనువుఁ ♦ బూనెద నగ్నిని నాత్మనాథుఁడున్
గానఁగరానిచోఁ దనువు ♦ కాల్పనె, సాధ్వికి భర్తతోడిదే
గాని జగంబు వేఱొకటి ♦ గాదు విలాస మనాథ కున్నదే!

గౌరి — లచ్చీ! యేమి నీకివెఱ్ఱి.

సీ. బ్రహ్మాండ మంతయు ♦ బట్టి రథముఁ జేసి,
త్రిపురాసురుల సంహ ♦ రించె నెవఁడు
కడలిలోపలఁ జొచ్చి ♦ గాలించి సోమకా
సురును సురులఁ దీసి ♦ చూపెనెవఁడు
జీవరాసులు తన్నుఁ ♦ జేరెడు నట్లుగా
సృజియించి యాడింపఁ ♦ జేసెనెవఁడు
మూఁడు జగంబులు ♦ ముచ్చటగా మూఁడు
మూర్తులై యేలెడు ♦ ముఖ్యులెవరొ

తే. గీ. అరయవైతి విన్నాళ్ళు కా ♦ పురము జేసి
జగములు హరింపఁ జాలు నా ♦ జలజమౌళి
జగములను గాచునట్టి యా ♦ జలజదృక్కు
జగము లుదయింపఁ జేయు నా ♦ జలజభవుఁడు.

లక్ష్మి — నాపతికై నేను వెదకి వెదకి వేసారి పోయితిని.

ఆ. వె. సూర్యచంద్రులార ♦ సురలార మునులార
గగన చారులార ♦ నగములార
పరమయోగులార ♦ పతిభిక్షమును బెట్టి
ప్రోవరయ్య నన్నుఁ ♦ గావరయ్య.

నారదుఁడు — (ప్రవేశించి) భర్తలు అత్రి అనసూయలకు బిడ్డలై యేడ్చుచుండ వీరిచ్చట వెదకుచు వగచుచున్నారు. నేను పోయి వారి జాడనెఱిఁగించెదఁగాక.

ఆ. వె. వార్తలెఱుఁగఁ జెప్పి ♦ వర్తింతు లోకంబు
లందుఁ గలుగు ఫలము ♦ లందునాకు
పాలు లేదు; వారి ♦ ప్రారబ్ధములఁ బట్టి
జరుగుచుండును గ్రహ ♦ చార ఫక్కి.

గౌరి — అదిగో! సకల కళావిశారదుండును సర్వజ్ఞుండైన నారదుఁ డీవంకకే వచ్చుచున్నాఁడు.

లక్ష్మి — వానికీయుదంత మేమైన దెలియునేమో తెలిసికొందము రండు. (ఎదురేగి),

గౌరి — నారదా! సమయమున నీవాపద్బాంధవుని వలె ప్రసన్నుఁడ వైతివి.

నార — నావలనఁ బని యేమి తల్లీ?

లక్ష్మి — మునీంద్రా! త్రిమూర్తు లేమైనారు?

నార — అనసూయను వంచింపఁ బోయి ఆమెకు పసిబిడ్డలై యామె ఒడ్డాలలో నాడుకొనుచున్నారు.

గౌరి — ఏమినారదా! మాతో నెకసక్కెము లాడుచున్నావా?

నార — లేదు తల్లీ! జగన్మాతలైన మీయెడ నపచారము చేయ సాహసించెదనా?

నర్మ — శాపముచే సూర్యుం డుదయింపమి లోకములన్నియుం దల్ల డిల్లినవి. యింక త్రిమూర్తులు లేచిచో నేను గతి.

(అని నిష్క్రమించును)

గౌరి — అహో! యేమి యీ విచిత్రము.

సరస్వతి — ఇందు చిత్ర మేమున్నది.

తే. గీ. అనల శిఖలైన నంటుట ♦ కలవియగును
హాలహాలమైనం ద్రావుట ♦ కలతియగును
కాలసర్పంబు కోరలు ♦ కదపవగును
కాని సాధ్వినిం గన్నెత్తి ♦ కాంచ నగునె!

గౌరి — నిజము.

తే. గీ. కృచ్ఛ్రచాంద్రాయణ తపోగ ♦ రిష్ఠులైన
వేదవేదాంతశాస్త్రప్ర ♦ వీణులైన
అక్షయతశాపమోక్షణా ♦ దక్షులైన
వార లోకపతివ్రత పాటి ♦ వారు గారు.

లక్ష్మి —

తే. గీ. ప్రాణవిభు సేవకంటె వే ♦ రైనసేవ
పతికిం జెల్లదు పతియె యీ ♦ శ్వరుండు సతికి
సద్గుణము లెన్ని యున్నను ♦ సాధ్వికాని
సతికి సుగతులుం గగనపు ♦ ష్పములుగావె!

సర — అటులైన సది యచంచలాపవర్గమార్గమే. ఈవిధ మనసూయ మొతింగి,యే యూమె దేవాదుల సృష్టించినది.

గౌరి — అగును. మన మూమెనే సంవిధానము చేసి పతిభిక్ష మడు గుదమురండు (అని పోవుదురు).

అన — (పిల్లలను తొట్టెలోఁ బరుండఁబెట్టి)

పాట

జో జో నాపుత్రా
నాముద్దుసుతా సరి ధపమగరిస. జో
కో కి లా శుకాశారికాళుగ
వినదము లవె విను—జోజో

అత్రి — దేవీ! బిడ్డలులేరని పరితపించితివి. చూచితివా యీశ్వరు డెందరి నిచ్చినాడో,—

మ. కలుములే లేములు వచ్చుఁబోవు నవి యా ♦ కాశంబుపై మేఘముల్
వలె భాగ్యంబె నిజంబుగా మనకు దై ♦ వంబియ్యగానున్నదో
సిలితోఁబోసి సువర్ణవృష్టిఁ గురియున్ ♦ సేవించి యర్థించి తేఁ
గలమా యొక్క తృణంబు నీశ్వరుని సం ♦ కల్పంబులేకుండినన్.

అన — నాథా! తామానతిచ్చినది వాస్తవము.

అత్రి —

ఆ. వె. మూఁడులోకములకు ♦ మూలపురుషులైన
మూఁడుమూర్తులిట్లు ♦ ముద్దుమురువ

టలు వెలార్చుచుండి ♦ రలివేణి నూడవే
సుతులసొగసు శశిని ♦ జూచునట్లు.

అన — నాథా! మనయింటి కెవరో దాసరులు వచ్చుచున్నారు. చూచితిరా.

అత్రి — ఏరెవరో స్త్రీలవలె నున్నారు.

(గౌరి, లక్ష్మి సరస్వతి సమీపింతురు)

పాట

ద్విపద. పతిభిక్షమును పెట్టి ♦ పాలింపవమ్మ
పతికంటె సతికి నే ♦ గతి లేదు గంటె
అనసూయ! నీయెడ ♦ నపచార మెంతో
యొనరించితిమి సైరింపు ♦ మో తల్లి గాన.

అన — అమ్మా! మీరెవ్వరు?

అత్రి — ఈపిల్లల భార్యలై యుందురు.

అన — దేవులారా! యీ యాసనముల నలంకరించి మమ్ము కృతార్థులను జేయుడు.

అత్రి — తామెవ్వరు?

గౌరి — ఈమె సాగరుని కూఁతురు లక్ష్మి; ఈమె యామె కోడలు సరస్వతి.

సర — ఈమె ఆర్యా మహాదేవి.

అత్రి, అన — ఆహా! మేము ధన్యులము, ధన్యులము (అని కాళ్ళపైఁ బడుదురు)

గౌరి — (లేనదీసి) ఓ మహానీయసంశితులారా! మీకు శుభమగును గాక! అత్రీ! నీవు తపస్సుచే మూఁడులోకములను మెప్పించిన మహానుభావుఁడవు. నీచరిత్రము సకల పాపహరము. నీయర్ధాంగి అనసూయ మహాపతివ్రత. ఈమె పదసరోజ రజోలేశమునకైన మేము ముగ్గురము కొరగాము సుమా.

లక్ష్మి — ఈమహాసాధ్వి అనసూయ గంగా శాపవిమోచన సందర్భమునఁ జూపిన మహాశక్తికి లోకము లన్నియు నివ్వెఱపడి పోయినవి.

సర — నర్మద సూర్యోదయము కారాదని శాపము పెట్టి నప్పుడీ యనసూయయే లేకున్న లోకము లన్నియు నీపాటికి చీకాకు పడి నశించియే పోయియుండును.

అన — అమ్మా! మీదర్శన మహాభాగ్యము వలన మాజన్మము తరించినది.

సీ. బలు లర్పణముఁ జేసి ♦ పగలు రేయనకుండఁ
ప్రార్థించినను గానఁ ♦ బడవు నీవు;
రణములు ఛేదించి ♦ రాజుల నిర్జించి
ప్రణమిల్లినను గాన ♦ రావు నీవు;
కార్యముల్ శోధించి ♦ కల ధనం బర్పించి
పూజించినను చిక్కఁ ♦ బోవు నీవు;

అత్రి —

కైలాసమందు స్వ ♦ ర్గమునందు సత్యలో
కమునందు విహరించు ♦ గరిత లైన

తే. గీ. మీరాక నాపుణ్యవశమున ♦ నాకు స్వర్ణ
ఛత్రచామరాలికా లన్ని ♦ కర్థ మొసంగె
నాకు నా సంకటంబు ధ ♦ న్యత వహించె
బ్రోవరమ్మ మాతృకల్పులు ♦ గావరమ్మ.

గౌరి — అత్రీ! ఋషిసత్తముండ వైన నీవు అతిథి అభ్యాగతులకు ప్రాణమైన ధాన్యమోసి పూజించి పరమపవిత్రమైన పుణ్యమును సంపాదించి ప్రఖ్యాతి వడసితివి.

లక్ష్మి — తల్లీ అనసూయా! నీకసూయలేకున్నను నీపాతివ్రత్యమహామహిమ కసూయ జెందిన త్రిలోకాధినాథులైన యీ త్రిమూర్తులు నీమీద ఘోరమగు నపరాధము గావించి తగిన శిక్షను బొందినారు.

అన — అనఁగా యేమి తల్లీ!

గౌరి — నీవు తొట్టిలో పరుండఁబెట్టిన బిడ్డ లెవరు?

అత్రి — అతిథులై వచ్చి మాచే నర్చింపఁ బడినవారు.

లక్ష్మి — ఈ కుమారకుమారులే మాముగ్వురకు భర్తలు.

అత్రి — ఆహా! వీరు త్రిమూర్తులా దేవతలారా! నాఅపచారములు క్షమింపుఁడు (అని నేలకొరగి మ్రొక్కుచున్నాఁడు).

సర — సోదరీ! అనసూయా! నాభర్తను నాకొసంగుము (అట్లే తక్కిన వారును అడుగుదురు).

అన — (వేగము పోయి) (తొట్టెలలోని పిల్లలను దెచ్చి యెవరి భర్తను వారి యొడిలో బడవేయును.)

గౌరి — శంకరా, సాధువశంకరా!

మ. గరళంబంగిటఁ బట్టినాఁడవు మహా ♦ కాయుండవై; కాలివై
పురసంహారము జేసినాఁడవు; జగత్ ♦ పూజ్యుండవై శీలివై

మరునిన్ మూఁడవకంటిమంట నొగి భ ♦ స్మప్రాయునిన్ జేసితో
హరుఁడా! యీయనసూయ డింభకుఁడవై ♦ యల్లాడెదే యక్కటా.

లక్ష్మి — కేశవా! దైత్యారీ!

ఉ. పాలసముద్రమందు వట ♦ పత్రముపైఁ బవళించి కుఱ్ఱవై
వ్రేలిని నోటిలోనిడి ప్ర ♦ వీణతనంబున నాభికాసరో
త్పలయుమందు బ్రహ్మఁగని ♦ యాడుచునుండెదు వేడ్క మాకు నీ
వేళనుజూపఁ జాలితివి ♦ విశ్వకుటుంబివి గావె కేశవా!

సర — పితామహా! నీకీశిశుత్వమేమి?

ఉ. ధారుణినెల్లవారికిఁ బి ♦ తామహుఁడై సృజియించి లోకసం
సారము సారహీనమని ♦ చాట భవార్ణమున్ దరింప సాం
పారఁగ వేదనొకలిడి ♦ వాసిని గాంచి యిదేమినిల్వనన్
నీరయి యత్రిదార కొక ♦ నీరసపుత్రుఁడ వైతి వబ్జజా!

(అని ముగ్గురు అనసూయ యొడిలో నాబిడ్డలను మరలఁ బడవైచి)

ముగ్గురు — అనసూయా! వీరిని నీవే పెంచుకొనుము.

అత్రి — దేవీ! ఏమి నీభాగ్యము; త్రిలోకముల నేలు త్రిమూర్తులను పోషించు మహావైభవము నీకుఁ జేకూరినది. కాని శుద్ధసాత్వికులమైన మనకిది చెల్లదు. వారిని యథాస్థితికి వచ్చునట్లుఁ జేయుము.

అన — దేవులారా! మీరలుగవలదు. మీభర్తలు తొంటి రూపమును దాల్చి మీకమందానందము గూర్చెదరుగాక.

ఉ. నేను పతివ్రతామహిమ ♦ నించుకఁ గల్గిన దాననేని నా
ప్రాణవిభుండు పేదల తప్పు ♦ దార్తిని దీర్చు మునీంద్రుఁ డేనియున్
భానుసహస్రమండల వి ♦ భాకర తేజుల మూఁడుమూర్తులన్
నేనిట సత్కరింప నిట ♦ నే నిజరూపము దాల్తు గావుతన్.

(మూడుమూర్తులు నిజరూపములను దాల్చి వారి భార్యలను సమీపింతురు.)

త్రిమూర్తులు — అనసూయా! మా అపరాధము క్షమింపుము తల్లీ; జగద్ధిత తేజోమూర్తియగు దత్తాత్రేయుఁ డను పుత్రుఁడు నీ కచిరకాలమున గలుగునుగాత! నీవు ఆకల్పాంతము పతివ్రతాశిరోమణివై స్త్రీల కలంకార ప్రాయవై ప్రకాశించెదవుగాత.

(తెరపడును. మంగళము)

## గద్య

ఇది ఉమర్ అలీషా కవికృత అనసూయాదేవి మహా నాటకమునం
దైదవ యంకము సంపూర్ణము.

---

# ఇందువచ్చు పాత్రలు

## పురుషులు

1. అభవుఁడు
2. భవుఁడు
3. దేవేంద్రుఁడు
4. సోమపాదుఁడు
5. గుణదత్తుఁడు
6. గురువు
7. పీరిసెట్టి
8. జంధ్యాలభట్టు
9. దొంగలు
10. జాలరులు

## స్త్రీలు

11. కళ
12. చంచల
13. దేవకన్యలు
14. ఎరుకసాని

---

# కళ.

## నాంది

ఉ. ఏపరమాత్మ వైభవ మ ♦ హీన మహామహిమాస్వరూపమై
ఈపదునాల్గులోకములు ♦ నేర్పడ దిద్దెనొ; యేది యూథమో
ఆపరతత్వతేజము వ్యా ♦ దంతరమాయ, జడాంధకారముం
బాపి తమోనివృత్తికర ♦ భాగ్యశతంబులు మాకుఁ గూర్చుతన్.

నాంద్యంతమున సూత్రదారుఁడు — నటీ! అలంకారములు ముగిసిన నొకసారి యిటురమ్మ.

నటి — (ప్రవేశించి) నన్ను పిలిచినపని యేమి?

సూత్ర — నటీ! జ్ఞానమహాసభాసభ్యులు నేఁడు కొలువు దీర్చి యేత త్సభ్యుల పూర్వచారిత్రములు యథావిధిగ మనచేఁ బ్రదర్శింపఁ బడు టకు సముత్సుకులై యానతిచ్చి యిదే యెదురుచూచుచున్నారు.

నటి — ఏమి మన మహాభాగ్యము! జ్ఞానమహాసభాసభ్యులమ్రోల మన నటనాకౌశలము ప్రయోగింపఁగల యమూల్యావకాశము సమ కూడినది! ఆహా! ధన్యత్వము ధన్యత్వము. నాథా!

ఉ. పండితులున్ మహాకవులు ♦ బంధుర దివ్యకళాప్రకాండు లా
ఖండలసన్నిభుల్ నృపులఁ ♦ గాదని నాటక మాడనేర్చు ను
ద్దండ కళాకలాప సము ♦ దార మహామహిమాస్వరూప మా
ర్తాండులు జ్ఞానసభ్యులను ♦ రంజిలఁ జేయఁగ నేరికళ్యమా.

సూత్ర — నీవన్నది యథార్థము. నటీ! ఇవి వారి స్వీయకథా విధానములే గదా! లోటు లున్నను మన్నింతురు.

నటి — నాథా! యీనాటకము పే రేమి?

సూత్ర — కళ.

నటి — అనఁగా?

సూత్ర —

తే. కళ మహాపతివ్రత జ్ఞాన ♦ కళను నేర్చి
కష్టకాలానఁ బతినంటి ♦ కాఁపురంబుఁ
జేసి ధర్మంబు దప్పక ♦ వాసికెక్కె
ఆయుదంత నాటకమె నేఁ ♦ డాడవలయు.

నటి — ఇది వ్రాసిన కవి యెవరు?

సూత్ర — ఎఱుఁగవా?

ఉ. నాటకముల్ పురాణములు ♦ నవ్యకథా కలితార్థ కావ్యముల్
పాటవ మొప్ప వ్రాసి నిజ ♦ పాండితి నాంధ్రవసుంధరన్ నిరా
ఘాటముగా వధానముల ♦ జ్ఞానరహస్యము లుగ్గడింప దే
శాటన మాచరించు నుమ ♦ రాలిమ సత్కవి వ్రాసె నీకళన్.

నటి — ఇంక నేమి కావలయును?

తే. కళ త్రిలోకంబులకును నా ♦ కాంక్షితంబు
అందులో జ్ఞానకళ వ్రశం ♦ సార్హ మగుట
స్వర్గపాతాళముల కదే ♦ వ్యాప్తి గాంచు
నిజ భవాభవజన మహా ♦ నీయ మగుచు.

(తెర)

## ప్ర థ మా ం క ము

•••••

(భవుఁడు ప్రవేశించి యుండును.)

భవు — విహంగ తిరస్కరణీ క్రియాకలనచే సంకల్ప మాత్రమునఁ బాతాళమునుండి భూలోకమునకు వచ్చితిని. అదిగో! నావలెనే పైనుండి యెవరో వచ్చుచున్నారు.

అభవుఁడు — (పైనుండి ప్రవేశించి) ప్రాయికముగా నీభూలోకము మాకు ఘంటాపథము.

భవు — (సమీపించి) స్వామీ! మీ రెవరు? ఎచ్చటనుండి వచ్చు చున్నారు?

అభ — మేము దేవతలము. మాది అమరావతి.

భవు — మహాభాగ్యము. అచ్చటి విశేషములేమి?

అభ — అనంతము.

సీ. మణులు మాణిక్యాలు ♦ మలపి కట్టిన
  మహా సౌధాలపంక్తు ల ♦ చ్చటను గలవు
మిన్నేరు వెట్టిన ♦ మిసిమి బంగరుచాఱు
  సైకతసీమ ల ♦ చ్చటను గలవు
రాయంచ లఖిల శా ♦ స్త్రములను జదువుచు
  జరియించు చోటు ల ♦ చ్చటను గలవు
గీర్వాణవాణిని ♦ గీర్వాణి వీణ ని
  చ్చలు మీటుచోటు ల ♦ చ్చటను గలవు

తే. అమరకాంతలు నీరాజ ♦ నములు దెచ్చి
స్వాగతం బిచ్చు పూజ ల ♦ చ్చటను గలవు

సహజసౌందర్యసీమ ల ♦ చ్చటను గలవు
ఆపురంబు స్వర్గంబు మా ♦ కాపురంబు.

భవు — మీరు ధన్యులు!
అభ — నాయనా మీ రెవ్వరు? ఎచ్చటివారు?
భవు — మేము నాగులము. మాది రసాతలము.

మ. విషఫూత్కార రవైకసంక్షుభిత దృ ♦ గ్విస్తార విస్ఫారిత
తృషితాభ్రంకష భీషణోరగ మహా ♦ హింసాప్రపూరంబు నా
మిషమస్తిష్కవసాగ్రఖాదన పరో ♦ న్మేషాసవ ప్రోజ్జ్వల
చ్ఛషకాభీలము రాక్షసాలయము పా ♦ తాళంబు మా వాసముల్.

అభ — నీవిచ్చటి కేల వచ్చితివి?
భవు — భూలోకవిచిత్రములు చూడ వచ్చితిని.

సీ. ఆశ్వలాయన దేశ ♦ మరసి త్రివిష్టప
శృంగారవనుల వీ ♦ క్షించినాఁడ
చ్యవనదేశవిచిత్ర ♦ చారిత్రకములఁ ద
చ్ఛీల విలాసాలఁ ♦ జెలఁగినాఁడ
యావనదేశ ని ♦ త్యాభ్యంతరావాస
లీలావిశేషాలఁ ♦ దేలినాఁడ
శ్వేతభూముల లాస్య ♦ వీథుల లజ్జావి
హీన విన్నాణాల ♦ నిరికినాఁడ

తే. ఈ చతుస్సముద్రాంత ర్బ ♦ హిర్గతంబు
లైన దేశాలఁ దత్తత్ప్ర ♦ జావళులను
జూచినాఁడ సరాలు దోఁ ♦ బూచులాడ,
కాని యాథాత్మ్యచింత సుం ♦ తేని లేదు.

అభ — ఇది కడుంగడ విచిత్రము. మీరు పాతాళలోకవాసులు. మీ కాధ్యాత్మచింత యేమిటి?

తే. తపసుచే క్రతు జప దాన ♦ ధర్మనిరతి
వచ్చుచుందురు బుధులు మా ♦ స్వర్గమునకు
తమసుచే నిత్యకోపతా ♦ పములచేత
తరలుచుందురు నరులు పా ♦ తాళమునకు.

భవు — అగును. ఈ భారతదేశాంతర్గత ఆంధ్రభూమి నాధ్యాత్మిక విద్యాపీఠమునఁ జేరి యేతచ్ఛీలము మారసాతలమునకుఁ గొంపోయి గొప్పపరివర్తనము పుట్టించెదను.

అభ — నీవు ధన్యుఁడవు. నేనును, అదే సంకల్పమున వచ్చితిని.

భవు — నాకు నీవు తోడగుదువా?

అభ — సరే! మనము ప్రచ్ఛన్నముగా వారిశీలముల నారయుదము రమ్ము. నేఁడు సోమపాదునియింట మహాసభ జరుగనున్నది.

(నిష్క్రమింతురు)

రంగము — గృహాంగణము

(సోమపాదుఁడు, కళ, గుణదత్తుఁడు, జయ, దాసి ప్రవేశింతురు)

కళ — నాథా! మీసవతిసోదరుఁడు గుణదత్తుఁడు తన ఆస్తిని పంచి యిమ్మని అడుగుచున్నాఁడు.

సోమ — అనంతమైన మనమహాభాగ్య మాతఁ డిదివఱకే దుర్వ్యసనములకు మఱిఁగి కడ తేర్చినాఁడు.

గుణ — ధనము మానవుని యొక్కఁ-ఆలను పూరించు నొక నిమిత్తమాత్రమైన రశ్మి. అది ఆకస్మికమైనది. విద్యావిలాసములచే మోహాత్మకప్రకృతిని రేపి, అచేతనములందుఁ జేతనము కల్పించు దయ్యము.

దానిని నేను స్వర్ణదీనారముగా మార్చి వసుంధరను వసుంధరగాఁ జేసి, జీవితములోని ఆ లోకసుందరప్రభలను ప్రభాతరాగములోఁ గలపివేసితిని.

జయ — నీ వన్యదారాప్రమత్తమతివై విరుద్ధములగు నిషేధముల లెక్కింపక కలధనములెల్ల వెచ్చించి నేఁడు నీతిశాస్త్రపారంగతుని వలె మాటాడుచున్నావు. సరే! నేను ముందు జీవించు తెఱంగేమి? నీసోదరుఁడన్నియు నీకిచ్చి నిర్ధనుఁడై పోయినాఁడు. నన్నాతఁడును పోషింప నసమర్థుఁడై మీనమేషములు లెక్కించుచున్నాఁడు.

కళ — సోదరీ! నీకేమియు కష్టము లేదు. నాతో నుండుము. మన కీశ్వరుఁడెన్నటికైన మేలు గూర్చిన నది నీదిగనే భావించుము తల్లీ!

గుణ — నీవూరకుండుము! ఇది గయ్యాళి. ఈమె సహవాసము నిన్నుగూడ గాఢాంధకారమున ముంచివేయును!

జయ — సరే! నేను గయ్యాళినిగదా! నీతాళము పట్టెద నుండుము.

గుణ — ఓసి చచ్చూ! నీవు చేయునదేమి?

జయ — ఏమా! చూచెదవు గాక. రేపే విడాకు లిచ్చి వేశ్యలలో కలసి పోవుదును. గతికమైన మర్యాద మట్టిలోఁ గలపివేయుదును.

కళ — తల్లీ! అంతపని చేయవలదు.

సోమ — జయా! నీవు నేఁటివఱకు ప్రసిద్ధమైన సద్గుణసంపత్తిగల సాధ్వివి. నీవిట్టి విపరీతకృత్యములు తలంపవచ్చునా?

జయ — నీసోదరుఁడు చేసిన అన్యాయములు నన్నీతీరున మార్చివేసినవి.

సోమ — సేవకా!

సేవ — స్వామీ! ఏమి సెలవు?

సోమ — వీరిశెట్టిని పిలువుము.

సేవ — చిత్తము.

వీరి — (ప్రవేశించి) ఏమి బాబూ! కబురంపినారఁట. మీకేమైన బదులు కావలెనా?

సోమ — మాకొక పదివేలరూకలు బదులు కావలెను.

వీరి — అది యెంతసేపుబాబూ! ఇదిగో (అని యిచ్చును)

సోమ — (పుచ్చుకొని) జయా! ఈరూపాయలు దీసికొని నాసోదరుని సేవాపరాయణత మానక సతీమణివై వర్తించుము. (అని యిచ్చును.)

గుణ — అగును. (అని జయచేతిలో రూకలపంచి లాగికొని వెళ్లి పోవును)

జయ — అయ్యో! అయ్యో! నాధనమేదీ! (అని నెత్తి కొట్టుకొని పడిపోవును)

సోమ — అదిగో గురువుగారు శిష్యులతో వచ్చుచున్నారు. సందడి సేయక సన్మానపరంపర నర్ఘ్యపాద్యములు సమర్పింపవలయును.

గురువు — (ప్రవేశించును; ఎల్లరు నమస్కరించెదరు.) జయము, జయము.

జయ — నాపే రెవరెత్తుచున్నారు. (చూచి) ఓహో గురుమహాశయులా! (అని లేచును)

గురు —

సీ. నిరుపేదలకు నెల్ల ♦ నిరతాన్నదానంబు
గావించు నర్థసం ♦ గ్రహము గూర్చు
ఆధ్యాత్మికజ్ఞాన ♦ మాదర్శముగ నుండు
సారస్వతంబు సొం ♦ పారఁ బెంచు
భక్తులకోష్టాలు ♦ పాలించుటకుఁ దమ
ప్రాణాల నొడ్డు నే ♦ మైనఁగాని
పాఠశాలలయందు ♦ పరమనైతికతత్త్వ
పద్ధతుల్ నేర్పించు ♦ వసతు లిచ్చు

తే. గీ. ఇట్టి సత్కార్యముల నాచ • రించు నెవ్వ
ధనము ధారాప్రవాహ వి • ధాన విలిచి
స్వర్గమున కీతెఱంగు సో • పానపంక్తి
కట్టుచున్నాఁడు సోముఁడు • కళను గూడి.

సోమ — ఇది అంతయును తమ ఆశీర్వాద విశేషము.

గురు — మీ కీశ్వరుఁడు తోడుగుఁగాక! సభ్యులారా! మన ఆధ్యాత్మిక విజ్ఞాన విద్యాపీఠమహాసభ మిక్కిలి ప్రాచీనము. కేవలము పవిత్రములగు మహదాశయములపై నాటుకొనియున్నది. దీనియందలి యథార్థములు మూడులోకములయందును బూజింపఁ బడవలసినవిగా నుండవలయును. దురాచారములు, పాపములు, నీతిబాహ్యములు మున్నగు మలీమసములైన కర్మకళంకము లానూలాగ్రము నశించినఁగాని జ్ఞానసాధనమునకు మానవు లర్హులు కాఁజాలరు. కావున మీమీ దివ్యానుభవములైన యాధ్యాత్మిక తత్త్వప్రతిపాదక మహా మహిమ లింకను పెంపొందింపవలయును.

కళ — స్వామీ! గార్హస్థ్యమునందలి స్త్రీల విధు లెట్లుండవలయును?

గురు — మిక్కిలి పవిత్రముగ నుండవలయును. స్త్రీలన్న సామాన్యులు గారు. శీలమే వారి యలంకారము. అట్టి

ఉ. ఇద్ధపతివ్రతామణుల • కే రవిచంద్రులు మూఁడులోకముల్
బద్ధము లీమహామహిమ • స్వార్థపరత్వముచేతఁ జేయు నే
సిద్ధులవల్లఁగాదు; కడుఁ • జేరువ స్వర్గము స్త్రీలకెల్ల నీ
పద్ధతి పూరుషావళికిఁ • బట్టను మాటలు వేయి చెప్పినన్.

జయ — ఎండవానలు లెక్కింపక తప మాచరించు ఋషులకు స్వర్గము పెరటిచెట్టువంటిది గదా.

గురు — కావచ్చును.

ఉ. కాననసీమలందు కడుఁ ♦ గష్టపరంపర లొంది డింది వి
జ్ఞానము నందికొన్న ఋషి ♦ సత్తముకంటె ఖలుండు భర్తకో
పానలమందుఁ గ్రాగి వెదు ♦ రాడక భక్తి భజించి జ్ఞానయా
మానినియే సుమాన్య యను ♦ మానము మాను తపస్సు లిట్టివే.

గుణ — సేవకుఁడు ప్రభువును కొలుచును. సూదివెంట దారము వచ్చును. మానవుని నీడ వెన్నాడును. అట్లే స్త్రీలు పురుషుల నాశ్ర యింతురు. అందేమి విశేషమున్నది? అది తపస్సెట్లగును?

గురు — తపస్సనఁగా నేకాగ్రమైన లక్ష్యము. హృదయాంతస్స్ఫూర్తి యగు ప్రేమమమూర్తియందు లయ మొనరించుట యని యర్థము. అది సత్యపతివ్రతల కొక్కరికే తెలియును. కావున స్త్రీలను దాసస లని భావింపఁజనదు. నిజముగా —

ఉ. ఇంతిఋణంబు దీర్పఁగలఁ ♦ డే పతి జన్మము లెన్ని యెత్తినన్
కాంతసతంబు స్వర్గనర ♦ కంబులమధ్యను నిల్చి భర్తకున్
స్వాంతకవాటముల్ తెఱచి ♦ స్వర్గముకై వడి మాఱు; నారక
ప్రాంత మహాఘదుఃఖములఁ ♦ బాపుమ జేరికి శక్యమీాపనుల్.

శో — మానవ జీవితము విచిత్రచరిత్రములపైఁ దిగుగుచున్నది. సంసారసాగరమున మానవుఁ డొక్కనావ.

గురు — దాని కర్ణధారియే దార.

గుణ — దారయూ లేక దారుఁడా! ఇది గొప్ప అన్యాయము.

గురు — నీవెఱుంగవు.

చ. పడఁతి గృహంబునందు నొక ♦ బంధురదీపిక యొల్ల వేళలన్
గడు ముదమిచ్చుఁ; బూరుషుల ♦ కంటె నిజంబుగ నాడువాండ్ర దే
వుడమి; పతివ్రతాతిలకముల్ గల ♦ ధామము మించి స్వర్గ మే
యొడఁగలదే! యిహంబునకు ♦ నింతియె సాధనమార్గ మారయన్.

గుణ — అది ఎట్లు సమర్థనీయము?

గురు —

సీ. ఒకనవ్వుతో భర్త ♦ కుండు కష్టములెల్ల
బరిమార్చు మన సిచ్చి ♦ గరితమిన్న
ఒకచూపుతో భర్త ♦ కుండుకళంకముల్
పోఁగొట్టఁ దేలించి ♦ పువ్వుఁబోఁడి
ఒకసన్నతో భర్త ♦ కుండు తాపత్రియం
బులు మాన్పఁ దెమలించి ♦ జలజవదన
ఒకమాటతో భర్త ♦ కుండు సందేహాలు
తొలఁగించు బోధించి ♦ తోయజాక్షు

తే. ఇట్టు లానందదేవియై ♦ యెసకమెసఁగి
బూరుషునిజన్మ తరియించి ♦ ముక్తిఁ బడయు
వటుకుఁ దరుణీలలామ తో ♦ డ్పడును గాదె
రమణికంటెను వేరె స్వ ♦ ర్గంబు గలదె.

మరియు గృహాంతర్వర్తియగు నర్థాంగిని చూచితిరా? పెక్కు తెఱం
గుల భర్తకుఁ దోడ్పడుచున్నది.

ఉ. ఇంటెనిగాచు కాపరి మృ ♦ గేక్షణ; పిల్లల నూడిగంబులన్
గంటికి రెప్పవోలెఁ గల ♦ కాలముఁ బ్రోచు కృతజ్ఞ; భర్తతో
నంటి గృహస్థధర్మముల ♦ యందు యథావిధిగాఁ జరించు వా
ల్గంటిని మించు నెచ్చెలులు ♦ గల్గుదురే భువనత్రయంబులన్.

మఱియు,

చ. దురితదురంతదుఃఖములఁ ♦ దోడ్పడి యర్థము ప్రాణ మిచ్చి సం
బరమున నొందఁజో సతులు ♦ భర్తలఁ గూర్తురు; భార్యకంటె నీ

ధరణిని దైవమున్ గలదె ♦ తప్పక సత్య పతివ్రతా మనో
హార రమణీలలామ సతి ♦ యైన మంతెందుకు స్వర్గ మారయన్.

గుణ — ఇది యతిశయోక్తి యనిపించదు గదా?

గురు — కాదు; ముమ్మాటికిని గాదు.

చ. అరయు పతివ్రతాతిలకమై ♦ యలరారెడు పుణ్యశీల నీ
తరుణిని నిల్పి యీశ్వరుని ♦ తత్త్వము నామె హృదంతరంబునన్
బరిణతమైన ప్రేమ యను ♦ పాఠములోపల నేర్చుకొమ్మ! యీ
గురువుల నేల కొల్చెదవు ♦ కోవిదుడా! యివె నుమ్ము మర్మముల్.

సో — ఇట్టి భావగంభీరము లైన యౌగికవిషయము లీలోకము గ్రహించుటకే బహుకాలము పట్టును. ఇంక నాచరణమున కెట్లు సాధ్యము?

కళ — గురువర్యా! స్త్రీల కెంతవఱకు స్వతంత్రత నియ్యవలయును?

గురు — ఇచ్చుట యేమి? అది వారి యోగ్యతనుబట్టి యుండును.

చ. తరుణి వివేకము౯, జపము, ♦ ధర్మము, జ్ఞానము తత్త్వదీక్షల౯
గురువుల చెంగటన్ బడయఁ ♦ గోరనవారల మాన్పువారు సూ
కరులయి పుట్టుచుండ్రు, బహు ♦ కాలము కర్మముఁ బాయలేక; యీ
మఱుఁగు నెఱుంగకున్న మఱి ♦ మానవజన్మ వృథాప్రయాసయే.

కావున, —

ఉ. మానినులన్ బ్రపుణ్యలుగ ♦ మార్చెదు యోగ్యత పూరుషాళిలో
మానసికానురాగమగు ♦ మార్గములోఁ గల; దాపథంబులన్
మాని, సతంబు వారి నను ♦ మానములన్ దిలకింతు రందుచే
మానవుఁ డాత్మసౌఖ్యములు ♦ మాపుకొనున్ దన తప్పెఱుంగకే.

జయ — నిజము, నిజము గురువర్యా!

చ. కలిమిని మెచ్చి లేమిని వి ♦ కావికలై చనుచుందు రట్టి యా
కలుషులకున్ గృహోజ్జ్వలు ♦ గల్గునె యంచు వచించునట్టివా
రలు; పురుషుల్ కడింది జవ ♦ రాంధ్రను బెట్టు శ్రమల్ తలంప; రా
కలనము కత్తి దారువును ♦ గాయ మెఱింగిన యట్టు లుండెడున్.

గురు — కావచ్చును.

ఉ. ప్రాణు లశాశ్వతుల్ తిరిగి ♦ వచ్చినవారలు లేరు; స్వాత్మ వి
జ్ఞానము గల్గువారె త్రిజ ♦ గంబులఁ బూజ్యు; లిహంబు రెండునా
న్త్రై; నడుసంత; దీనికయి ♦ యేడ్వఁగనేల? భవిష్యదర్థముల్
గాన; మదృష్ట మేపగిది ♦ గాఁగలదో యది తప్ప దేరికిన్.

సోమ — అటులైన ఆధ్యాత్మికజ్ఞానానుభవము కూడ అదృష్టలభ్య మేనా?

గురు — కాదు. అది మానసికపరిణామము.

ఉ. జ్ఞానపథంబు ప్రేమమయ ♦ సాగర మైనది; పూతమైన ఆ
స్థానము వహ్ని కన్న గడు ♦ దారుణమైనది; తత్పరీక్ష కే
మానవుఁడాఁగునో యతఁడె ♦ మాన్యుఁ; డెవండు గుహూత్తమాత్మ సో
పానములందు మానసిక ♦ భాండము మోదునో వాఁడె సిద్ధుఁడున్.

సో — అట్టి సిద్ధుల నియమంబు లెట్టు లుండవలెను?
గురు — ఆనియమంబు లాతఁడే నిశ్చయించుకొనును. కావున,

ఉ. ఏనియమంబులన్ దవిలి ♦ యేమి యొనర్చిన వ్యర్థ; మాత్మ వి
జ్ఞానరసంబు శూన్య కల ♦ శంబునుబోలె బ్రతిధ్వనించు నీ
మానసమందు నింపు; మనుమా ♦ నములన్ దెరలవ్వలున్న నీ
స్థాన మెఱుంగవచ్చు; దనుఁ ♦ దాన యెఱుంగు తెఱం గిదే సుమీ.

సోమ — గురువర్యుల దివ్యాదర్శములు పెద్దవి. మాహృదయములు చిన్నవి,

కళ — స్వామీ! మేము తరించితిమి.

గుణ — ఇదియొక మతము.

గురు — అట్లనఁ జెల్లదు.

చ. మతములు లేవు పెక్కు; మత ♦ మార్గములన్ వ్యతిరేకభావమున్
మతి దలపోయ కందుఁగల ♦ మంచిగ్రహింతురు; మచ్చుకైన దు
ష్కృతములు లేవు; తాత్త్విక వి ♦ శేష విలాస వినూత్న భావ సం
గతి బరమాత్మునిం దెలియఁ ♦ గల్గెడు త్రోవలె లక్ష్య మన్నిటన్.

కావున మీాశౌచశీలములచే నీధర్మము దేశదేశముల వ్యాపింపఁ జేయువలయును.

కళ — ఇది తపస్సుకన్న మహాపుణ్యము.

సోమ — సత్యము.

ఉ. ఎన్నిరహస్యముల్ తెలిసి ♦ యెన్నిమహత్త్వలు గల్గియుండినన్
దిన్నని మార్గమందుఁ దన ♦ దృష్టిని నిల్పి దరిద్రమందు, సం
పన్నతయందు ధర్మమును ♦ బాయక అగ్నిపరీక్ష కాఁగువా
రున్న నెకాని వారి మత ♦ ముండదు - ఉండదు వారిసంఘమున్

జయ — మఱి నామాట ఏమి?

గుణ — ఉదాసము. పైసా లేకపోతే ఉపవాసము. ఆపైనైతే సన్యాసము లేదా నాతో సహవాసము. అదే విలాసము. అది చెడితే రసాభాసము. ఈనీతి నీకోసము (అని వ్రేల్పట్టి చూపించును.)

జయ — చాలు నీసంభావణ కట్టిపెట్టుము.

శిష్యులు —

పా ట

ముక్తికి మార్గము మూలము దెలిసెను
మోదము గలిగెను మాకింక
భక్తిపథంబున భవభయహారమగు
వ్యక్తి లభించెను నిశ్శంక ॥ము॥
తాపత్రయముల ఆపద లుడిపే
ఆపరమేశ్వరు నర్చించి
కాపాడుటకై యేపురుషుం డెవ
నోపి భుజించుచు నుండునో ఆ ॥ము॥
గృహములలోపల గృహిణులలోపల
విహితమె స్వర్గము వివరింప
మహిళామానస మంజులప్రేమయె
మహితాదర్శము ముఖ్యముగా ॥ము॥

(పాడుచు నిష్క్రమించెదరు)

భవు — ఆహా! పరమధర్మ మన్న నిదే గదా.

అభ — అగు నిది దేవతలచేత సంస్తూయమానమైన మహాజ్ఞాన తత్త్వము.

జయ — నాకిక్కడకూడ శరణ్యము లేకపోయినది. నేనీదాసిని వెంట దీసికొని వేశ్యవాటికలో చేరి మోముపై ప్రచ్ఛన్నత వచ్చు రంగు పూసి పెద్దపరివర్తనము పుట్టించెదను; దానఁగాని యీగుణదత్తుని తెగులు కుదురదు. సరే. (అని చెంగున గంతువేసి నిష్క్రమించును)

(తెరపడును.)

# ద్వితీయాంకము

…○…

రంగము — పర్ణకుటీరము

(సోమపాదుడు పాటపాడుచు వచ్చును.)

సా॥

1

మానవజీవిత మేరీతి మారునో
కానరా దెవ్వరికి
ఆనంద మొప్పారు అతిశయముల మీరు
ఏనాఁడో పడిపోవును,
ఆనాఁడు దుఃఖాల మేఘాలు వర్షించు
మానసమను బీళ్ళు మునిఁగికరయిపోవు.

2

ఎలాటి చిత్రాలు కాలగర్భమునందు
గ్రాలి రానున్నవో
ఫాలాఫలకమందు వ్రాలు జరిగితీరు
ఎలాయీయత్నాలు నేలపాలై పోవు

3

తెలివితేటలు నున్న కలిమి పోయెనునాఁడు
గవ్వకు మారువుగా ॥గుడ్డి॥
ఖలుఁడని యనిపించు తులువని తిట్టించు
ఇలు వెళ్ళఁగొట్టించు కలవంటి దీబ్రతుకు ॥మా॥

సో — గడచిపోయిన కాలము శుక్లపక్షమువలె నొకవెలుఁగు వెలిఁగి 'గం' అని యారిపోయినది. ఇప్పుడు వచ్చినది కృష్ణపక్షము. ఇదంతయు

వ్యసనభూయిష్ఠము. చేతులతో చిల్లుటకుఁగాని, చిమ్మచీకటి. పూర్జిత మైన ధనప్రవాహము కొండవాగువలె ప్రవహించి ప్రవహించి హారతి కర్పూరమువలె నెగిరిపోయినది. బంధువులు మిత్రులు తిని తట్ట తగుల వేసి వెళ్ళిపోయిరి. నావద్దనిక కానీకూడలేదు. శిశువుఁ బువ్వులు చుట్టు కొన్న యిచ్చుట నెత్తిగొట్టుకొనుట కష్టము. కావున నీయూరు విడిచి పోవుట మంచిది. ఆహా!

శా. ఏదేశంబును పారిపోవుదును నే ♦ నేరీతి ద్రవ్యంబు సం
పాదింపంగల నెవ్వరడ్డుపడి నా ♦ బాధల్ నివారింతురో
యీదారిద్ర్యసముద్ర మీదుటకు నిం ♦ కేమున్న దాధార మ
య్యో! దీనత్వముకన్నఁ జావు మేలుఁ ♦ గెంతో దేవుఁ డీరాదొకో.

కర్మబద్ధులకుఁ జావుమాత్రము సులభముగ వచ్చునా! రాదు. కావున నెందైన లేచిపోయెదను. అచ్చట, —

మ. పరదేశంబుల నాకటన్ నిదురవో ♦ వన్ లేక యాచించుచుఁ
దిరుగంబోయిన నెవ్వ రీతఁ డని ప్ర ♦ శ్నింపగ నెవ్వారు గో
రరు, ప్రాణంబులు నోట వచ్చిన విశీ ♦ ర్ణంబైన నెవ్వారుఁ జే
రరు, రాగోదయమైన బొమ్మకణముల్ ♦ రాల్చన్ బ్రయత్నించుచున్.

అక్కటకటా! నా స్థితి యెంత నికృష్టమై పోయినది. సవతి సోదరుఁ డెంత యుపకృతి చేసినాఁడు. మంచికిపోయి పాడై పోయినాము.

చ. తినుటకుఁ గూడు లేదు; శ్రమ ♦ దీరుపఁగా నిలులేదు వీథిలో
జనుటకుఁ గట్టువుట్టములు ♦ చాలవు నేనును నాలుబిడ్డ లే
యనువునఁ బొట్టపోసికొన ♦ నానొకొ; కాటకమయ్యెఁ మాకు, మా
దినములు చెడ్డవయ్యె మఱి ♦ దీరని పేదరికంబు వేఁచెడిన్.

అయ్యో! ఇంకేది కర్తవ్యము!

ఉ. ఆలోకవంక చేడ్వఁ, దమ ♦ యాకటి కోర్వక బిడ్డలెల్లరున్
గోలలొనర్పఁ, జంటి పసి ♦ పూనలు పాలకుఁ బోరువెట్టఁగా
పాలిడు స్తనంబులున్ దొంకు ♦ నూటి యొకింతయు దోఁచదాయె; నా
యాలయు మొక్క దుఃఖపు ♦ మాలయమై కనుపట్టుచుండెఁ బెన్.

ఇదిగో! నాప్రేయసి కళ వచ్చుచున్నది.

కళ — (ప్రవేశించి) నాథా! మీదాసి మీపదపద్మములకు నమస్కరించుచున్నది.

సో — శుభ మగుఁగాక!

కళ — మీయాశీర్వాద మమోఘ మగుఁగాక!

సో — దేవి! అనుపమానమైన నీసౌజన్య విశేషముచేతనే నేనీమేన ప్రాణంబులు నిలుపఁగలిగితిని. లేనిచో నిదవరకే యీ కాటక దేవత నన్నాహుతి చేసి యుండవలసినది. కాని —

తే. గీ. అంతకంతకు నస్మదా ♦ శాగమంబు
పుల్లవిరిగిన ముద్రమానిఁ ♦ బోలె దినది
నంబు క్షీణించు; కృష్ణ ప ♦ క్షంబునందు
చంద్రకళలు తగ్గుచుఁ బోయి ♦ సమయునట్లు.

కళ — నాథా! యిట్టి మీదురంత సంతాపమునకు నిమిత్తము నేను గదా. ఆహా! నేనెంతటిపాపినో! ఓసూర్యచంద్రులారా! నన్నాచికొనరాదా! ఓభూమాతా! నిలో నాకొకింత చోటొసంగలేవా!

సో — యువతీ! యింతిగా నేల వగచెదవు?

కళ — నాథా! నాదొకమనవి చెల్లింపుఁడు.

సో — అదియేమి (స్వ) ఈమె ఏమికోరునో? (అని మూర్ఛిల్లును)

కళ —

ఉ. ఆకటిచేఁ గృశించి తమ ♦ మాఱుచు బిడ్డలు నేడ్చుచుండ నీ
శోకము చూడలేక యిటు ♦ శోషిల నేటికి నన్ను బిల్లలన్

దోఁకొని పాడునూతఁ బడఁ ♦ ద్రోయుట పుణ్యము దీనికన్న నీ
వ్యాకులతా దరిద్రతల ♦ వారణమార్గము లేదు చూడఁగన్.

అట్లు కాదంటిరేని, నేనిఁక నేబాధకును సహింపనోపకున్నాను.

ఉ. కూటికిఁ దేని యీఁకుగని ♦ కోమలివై యెటు కాపురంబు ని
చ్చోటను జేసి గంపెదు ని ♦ సుంగులఁ గాంచితి వింక వీరి నె
ప్పాటను బెంచనోచెదవు ♦ పాలును నీరును బోసి యుంచు నన్
మాటికి దెప్పుచుండ్రు దయ ♦ మాలి కడున్ బొరుగింటి మానినుల్.

ఇట్టివన్నియు వినుచున్న నాచెవులు చిల్లువడుచున్నవి. నేనింక సహింపఁజాలకున్నాను. కావున నేనూయియో గోయియో చూచుకొనుటకన్న గత్యంతరము లేదు. ఇందుకు మీ రనుమతింపవలయును. ఇదే మీరు నాకొసంగవలసిన వరము.

సా — (లేచి) అహా! నేనెంత నిర్భాగ్యుఁడను! దేవీ! నీవు స్త్రీజన సామాన్యమైన తీఁరున,

సీ. నగలు కావలెనంచు ♦ జగడ మాడఁగలేదు
ఆణిముత్యపుసరు ♦ లడుగలేదు
పట్టుబట్టలుఁ దెచ్చి ♦ పెట్టఁ బోరఁగలేదు
రంగుచీరలకు జీ ♦ రాడలేదు
కస్తూరిగంధముల్ ♦ కావలె ననలేదు
స్నిగ్ధసౌధాళిఁ గాం ♦ క్షింపలేదు
మృష్టాన్నభోజనం ♦ బిడ వేఁడగాలేదు
ధనధాన్యములను దే ♦ మ్మనఁగలేదు

తే. కలిమి పోయెను ♦ పుట్టింటఁ గాపురంబు
పెట్టుమని కత్తికోతలు ♦ పెట్టలేదు

బ్రతుకఁ దెఱువు వేఱు గాని పతి ♦ మాలుచుంటి
వకట నీయట్టిసాధ్వి లే ♦ దవనిఁ గలదె.

కళ — ప్రాణేశ్వరా! ఇదివఱ కెట్లు గడచినను సర్వైశ్వర్యమును, దుర్నివారకమైన యీయనిష్టప్రదేశత నాశాంశమును దూలించివేసినది. కాని నన్ను కొట్టుకొనిపోవకున్నది. ఇంక నేనేమి సేయుదును? మీసోదరుని నమ్మి మీరీసంసార మింకొకనిఁ జెప్పినారు. పైగా ఋణమై పోయినది. ధనమా జయుకు దక్కలేదు. ఆమె తీరువు మూర్చుకొన్నది. వేశ్య వాటిని చంచల యనువేఁ బెరుగుచున్నట్లు వినుచున్నాము. వాళ్ళపాల్లెట్లున్నను మనగతి యేమి?

సీ. ఆకటికై యంగ ♦ లార్చుచు నింట బి
డ్డలతోడ నెన్నాళ్ళు ♦ నిలువవలయు
మైయెల్లఁ గప్పని ♦ మాసిపోయిన యొంటి
వలువతో నెన్నాళ్ళు ♦ వరలవలయు
జడ లల్లుకొని చిక్కు ♦ విడరాని చింపిరి
తలతోడ నెన్నాళ్లు ♦ తనరవలయు
పొరిగింటిపంచల ♦ నిరుకైన యరఁగులఁ
గాపురం బెన్నాళ్లు ♦ గడపవలయు,

తే. వానకొండకుఁ దలయొగ్గి ♦ వాసరములు
కష్టముల కోర్చి యెన్నాళ్ళు ♦ గడగవలయు
ధరణి రవిచంద్రగతులైన ♦ దప్పుఁగాని
మనదరిద్రపుదినములు ♦ మారవయ్యొ.

సో — అహా! ఇఁక మనకు దైవమే ఆధారము. మనము విజ్ఞానసభా సభ్యులము గదా. ఎన్నియాపదలకైన సహించుట మన విధియై యున్నది. వగవకుము.

పాట

1

దారేగసరాదు ఏదో, సుయ్యో, గొయ్యో
దారుణదుఃఖ విచారము ఘనమై
ఘోరదవాగ్ని గురిసెను నాపై ॥దా॥

2

ఉన్నవిలేనివి అన్నియు పోయెను. అయ్యో
అన్నమె యని తెగనార్చినను
ఖిన్నసన్నవి తెన్నునఁగన్న నా
సున్నయె వఱి యేమున్నది బ్రతికే ॥దా॥

3

చేసితి యత్నము చేసితి సేవా ॥దేవా॥
ఈసరి కవి ఫలశూన్యములై
గాసివెట్టె నీ దాసుఁడనై యీ
దోసిలి నొగ్గిన పీసము దొరకే ॥దారే॥

(పాడుచు నిష్క్రమించును.)

రంగము — మధువీధి

(వేశ్యలు విటులు గుణదత్తుఁడు ప్రవేశించి యుందురు.)

పాట

1

మధుశాలా మాతల్లి నిన్ను విడువనే ॥మ॥
అధరమందు నీకు కడు మధుర మున్నదే
సుధమైన నీలాటి దైవు సొంపునింపునే

2

ఈమధు విహారముల సాధకమునై
శ్రీమించు స్వర్గాల సిరి దేశ్ము దీవించు ॥మ॥
(అందరు పాడుదురు)

గుణ — జగము మిథ్యగాదు. మనము మిథ్య, మనభావములు మిథ్య, అతీంద్రియములైన స్వర్గనరకములు మిథ్యలు! పాపపుణ్యములు మిథ్య. ఒకటి యేమి? సర్వము మిథ్య. ఓమిథ్యా! నీకు నమస్సులు; ఓఆధ్యాత్మిక విజ్ఞానమహాసభానభ్యుడా! ఓఅస్పృశ్యవాదీ! నీ వ్యాసంగములింక కట్టిపెట్టుము. నీమర్మభేదకమైన వేదాంత తత్త్వప్రతిపాదక యోగసమాధి అనిర్వాణము, అమృతత్త్వము నాపాదములక్రింద నున్నది. నేను బూడిదనై నచో నేను నాపాదాలక్రిందకే పోవుదును. ఇదిగో నీనోటికి దాళము వేయుచున్నాను. నీవిక కల్పాంతరము దాక లేవజాలవు.

తే. గీ. మధువె యమృతంబు? శైలూషి ♦ మంజువదన
లెల్ల దేవకన్యలు; గానమే ♦ రసంబు;
తంత్రినాదమె తేజంబు ♦ దనరు వేశ్య
వాటికయె సుమ్ము కైలాస ♦ పట్టణంబు.

తే. గీ. వసుధ కిదె ప్రేమ నేర్పెడు ♦ పాఠశాల
కవుల కాణాచి; గాయక ♦ కల్పతరువు;
సోమరసమమ్మ వెలయాంధ్ర ♦ భూమి, వటుల
కోన, బ్రహ్మచారుల కొల్వు ♦ కూట మిదియు.

(నాట్యాంగనలు పాడుచు నృత్యము సేయుదురు.)

గుణ — ఆహా ధన్యము! ధన్యము!

మ. భరమౌ రాగరసంబు, సంధ్యలు, నమః ♦ ప్రాసాదముల్ కైకొనన్
శరముల్ చిమ్ముచు కాలవాహిని నభః ♦ స్వర్గీయగానంబులో

నెరసైపోయిన ప్రేమపాత్ర మెవరే ♦ నిన్ బాడి నిద్రాణమై
యిరులన్ గాటుకపట్టియున్న మాతి నెం ♦ తే లేపఁగా వత్తుగే.

ఎవరి కెవ్వరును గారు.

ఉ. చేసితి జన్మముల్; తపముఁ ♦ జేసితి; జీవరహస్య మేమిరో
యీసరి కక్కటా! తెలియ ♦ దింతయు వ్యర్థము బ్రహ్మవిద్య జి
జ్ఞాసనొపంగు ఘోరవిష ♦ సర్పము; దాని బరిత్యజించి యీ
యాసవమున్ మృగాక్షి యధ ♦ రాసవమున్ గొని మోద మొందెదన్.

భవు — ఇది నిక్కముగాదు.

గుణ — ప్రత్యక్షము లైన యీ రాగభోగములు నిత్యము గాని మొదల నిఁక నీవ్యథాకల్పిత స్వర్గసుఖంబులా నిత్యములు? కావు పొమ్ము, ఆవలకుఁ బొమ్ము. నేను బ్రహ్మజిజ్ఞాస యను దుఃఖరంగమును విడిచితిని. వేదాంతులు గొప్ప మోసగాండ్రు, లేదా గొప్ప భ్రాంతులు. వారివల నుండి యెటులో యదృష్టవశమున దప్పుకొ గలిగితిని. ఇంక నామిగిలిన దివ్యజీవన మహానంద నాట్యరంగమున నేఁడే ప్రవేశించితిని. దీనికి నాందీ ప్రార్థనము గావింపవలయును.

మ. కరముల్ మోడ్చి సురాగమంబులకు నా ♦ కాదంబరీదేవికిన్
సురకున్, వేశ్యకు, నల్లమందునకు, నా ♦ జుంభంగు గంజాయికిన్
స్వరసంగీతసుధారసంబునకు, వే ♦ శ్యావాటికిన్ పీటికిన్
శిరముల్ వంచి నమస్కరించెద సుఖ ♦ శ్రేయంబు సిద్ధింపఁగన్.

చంచల — (నాట్యము సేయుచు ప్రవేశించును)

పాట

1

తరళతరవిలోలనేత్ర సుమ
శశసన్నిభగాత్రి పవిత్రా ॥త॥

2

సరసహృదయ అళికుంతలఁ జూడ
విరులసరులు మెడ వ్రేలాగ

కీ

నిన్నుఁ గన్నుఁగొని మనమున వినుతించి
ఘనత నెంచి కృపకు ప్రార్థించి

ఆహా! నేఁడెంత హాయిగా నున్నది!

చం. పతి విడనాడితిన్; మనను ♦ వచ్చినవారిని గూడి యాటలా
డితి; సొగసైన పాటల వ ♦ రించితి; నిత్యము నృత్యగాన సం
గతి విటరాజశేఖరుల ♦ చాటున సోమరసంబు ద్రావుచున్
క్షితి నమరావతీపురముఁ ♦ జేసితి దుఃఖములేమ నామదిన్.

గుణ — ఆహా! నీవే నిక్కముగ వేదాంతవేదివి. ఏమందువా? దుఃఖనివృత్తియే జీవన్ముక్తి. ప్రేయసీ! ఈ యాసవ మొకింత ద్రావుము. చాలసేపు నాట్యముచేసి అలసిపోయితివి. (అని యిచ్చును) పూర్వమగస్త్యుఁడు సప్తసముద్రము లొక్కగుక్క పట్టినాఁడు. ఏములో నొకటి కల్లుసముద్రము. నేనిప్పుడు ద్రావుచున్న దా కల్లే. కావున నాయగస్త్యునకును నాకును చింతాకంత వార చంచలా! ఈ చషకమును పరిగ్రహింపుము. ఇది సురపూజాభాజనంబైన మహాపదార్థము.

చంచ — ఇది యిదివఱకే నాకడుపులోఁ గలదు.

గుణ — ఆహా!

## పాట

### 1

అందకత్తె వహాహా! నీ వందకత్తె వహాహా
సుందరహారిణేక్షణ నీచందము నా
చందురుఁ డౌనయగు నా
ఇందిందిర చికుర ॥వం॥

### 2

కౌఁగిటను ముద్దిడుమా
ఆఁగనీకఁ గైకొనుమా
చంచ — ఆఁగుమాఁగు మింత లేగువా వే
వేగ పోపొ మ్మిది నగవా!
సాగ విచట కుప్పిగంతు
లేగుమీ విరాగి వగుచు ॥అం॥
అందకత్తె నైతే నేనందకత్తె నైతే
సుందర హారిణేక్షణ నాచందము నా
చందురు డౌన యగునో
ఇందిందిర చికుర ॥నం॥

గుణ —

మ. సురపైఁ దత్కలశంబుపై విరులపై ♦ శుద్ధాంతసౌధాళిపై
పరమాహ్లాద రసార్ద్రగీతములపై ♦ భక్ష్యాలపై నిద్రపై
సరసాలాపముపై సతంబుగల నా ♦ స్వాంతంబు నీపైఁ జెలీ
కరమొప్పారెను; నన్నుఁ గొమ్మినను ♦ మయస్వాంతంబుచందంబునన్,

చం —

మ. వురిపై; నావిరులమ్ము బుట్టపయిఁ దాం ♦ బూలమ్ముపై; హాసుపై;
పరకీయాశ్రవణంబుపై; చిలుకనుం ♦ బాచీరపై; పాటపై;
సురపైఁ; జందనచర్చపై; రయికపై ♦ శోభిల్లు నాప్రేమ నీ
పరకున్ రాదు పికంబు మావిచిగురున్ ♦ వర్జించి పోనేర్చునే.

గుణ — చంచలా! నాకింకేమిగతి?

చంచ — అధోగతి.

గుణ — ఓపికవాణీ! నీవు నిజము చెప్పితివి. (పై పద్యము చదివి) ఆమావిచిగురు నేనే యని భావింపుము.

చంచ — నీవు మావిచిగురువు కావు; నరమావిండిచిగురువు (అని పళ్ళికిలించును).

గుణ — (హాహాహాహా యని నవ్వి) ఆహా! చంచలా! నీవు దేవదానవులను పల్టీలుకొట్టించు ప్రోడవు. నీవు సామాన్యవేశ్యవు కావు. నిజముగ విటుల కొఱకు విశ్వవిద్యాలయమే యున్న దానికి నీవు ప్రధానాచార్య (Vice-chancellor) పీఠ మలంకరింపవలసిన నెఱజాణవు. నీకుఁ గల కామకళాజ్ఞాన మా వాత్స్యాయనాదులకైన లేదు. రంభాది దేవవేశ్యలు నీముంగల నల్లపూసలకైనఁ గొఱ గానేరరు. నీసౌందర్య మట్టిది! నీవంటి ముద్దులాడి కాలుతో తలపైఁ దన్నినను,

తే. గీ. తరుణి ప్రియురాలి వలపుల ♦ తన్ను చెఱకు
ముక్కకంటెను దియ్యనై ♦ మోదమిడును
తరుణి గజ్జెలందెల కాలి ♦ తన్నుఁ దిన్నఁ
జేతితో గారెలను దిన్న ♦ రీతిఁ దోఁచు.

చంచ — విటులపని తుద కంతే.

గుణ — చంచలా! ఇంక నాకేమిగతి?

చంచ — అధోగతి.

గుణ — ఈదుర్గతి కెవరు కారణము?

చంచ — కుమతీ! నోరుమూయుము.

గుణ — ఆహా! ఆహా! (అని పడిపోవును.)

చంచ — (లేపి) ఇంతలోనే భీరుఁడ వైపోయితివి!

గుణ — (లేచి) ఆ...ఆ...చంచలా! నీవేనాలేపినది!

చంచ — అగును (స్వ) పొరుగింటి పుల్లకూర రుచి! నేనీతని కుల కాంతగా నుండినప్పుడు పనికిరాలేదు. వెలకాంత నని చెప్పినంతనే పడి చచ్చుచున్నాఁడు.

గుణ — నేనెంత ధన్యుఁడను.

చంచ — గుణదత్తుఁడా! ఆవైపు (అని చూపించి) ఆవేశ్యావాటిక! (మెడలోచెయ్యివైచి)

తే. గీ. అందగాఁడవు నీవు నీ ♦ యంతవారు
లేరు లేరని యావెల ♦ లేమచనుల
చూచుకంబులు తలలూపి ♦ చూచుచుండె
పైటమాటున రైక పైఁ ♦ బైకి వచ్చి.

గుణ — నేనిప్పుడు స్వర్గలోకమున నున్నాను.

చంచ — (స్వ) నేనీతనిభార్య 'జయ' అని యెఱుంగఁడు.

గుణ —

ఉ. ఈసముపాసితం బయిన ♦ యీశ్వరతేజము భూమి నిండి కై
చేసి ప్రశంసనీయమయి ♦ చేరుచు నున్నది స్వర్గమందిరా
వాసము దాఁక; నీవెలుఁగు ♦ వాసన లెల్ల వెలార్చి జీవితా
భాసముఁనందు నేననెడు ♦ భావము సిద్ధముఁ జేయుఁ జూచితే.

చంచ — అది చాల నిగూఢమైన చదువు.

గుణ —

సీ. ప్రణయినీ! నీప్రేమ ♦ కార్ధి పిపికిలంచు
సాక్షి పోలెదు నన్నుఁ ♦ జూడవేమి
ప్రేయసీ! నీరాగ ♦ వీథిలోఁ బెసి రక్త
సిక్తుఁడౌ నన్ను వీ ♦ క్షింపవేమి
నెచ్చెలీ! నీమోహ ♦ నిబిడ దావాగ్నిలో
నీఱైన నన్నుఁ జిం ♦ తింపవేమి
మానినీ! నీవచో ♦ మాధుర్యవాహిని
కసువు నిచ్చెడు నన్ను ♦ నరయవేమి

తే. గీ. సంతసము నమ్మి దుఃఖమ్ము ♦ సంతలోనఁ
గొంటి; వెతఁగంటి; జేడిస ♦ కంటి నిన్ను
నల్లమను నింటిలో దాఁచు ♦ కొంటి; దానిఁ
దెఱచి కనుఁగొమ్ము నీకు సుం ♦ దరపటమ్ము.

చం — సరే! సంతసించితిమి, కాని నీవెంత మూర్ఖుఁడవు.

కం. అక్కఱకురాని మాటలు
పెక్కులు వచియింపనేల ♦ వెలవెలఁదికడన్;
టొక్కం బిడనిదె వేశ్యలు
చిక్కరు వారలకు ప్రేమ ♦ చిత్రము గలదే.

గుణ — హా! హతోఽస్మి, హా! హతోఽస్మి. చంచలా నీకిచ్చినధనము చాలదా! ఇంకను దెమ్మనెదవా?

చంచ — (నవ్వి. స్వ) ఇతఁడు నాడబ్బెంత హరించినాఁడో మఱచినాఁడు (ప్రకాశము) గుణదత్తా!

ఉ. ఒక్కక్షణంబులో వికసి ♦ తోత్పలనేత్రలపైని గల్గు పె
న్మక్కువ కెందరో విటులు ♦ మాన్యములమ్మి, గృహమ్ములమ్మి యే
దిక్కునో యప్పుచేసికొని ♦ తెచ్చి యఖండధనంబు లిత్తు రా
ఫక్కి యెఱుంగవేము తులు ♦ వా! వెలయాల్వెలఁజెప్పశక్యమే!

గుణ — ఆహా! చంచలా! ఎంతమాటంటివి. నేను తులువనా! ముద్దు లియ్యవలసిననోట నిట్టిసుద్దులేనా రావలసినది?

చంచ — అగును. డబ్బులేనివిటులకు వేశ్యలిండ్ల ముద్దులకు బదులు గుద్దులు! (అని గ్రుద్ది నిష్క్రమించును)

గుణ — హా! హతోస్మి హతోస్మి! ఎంతబ్రతుకు బ్రతికి తుదకిట్లు పరాభవింపఁబడితిని!

భవు — ఈతని కిప్పుడుగాని పశ్చాత్తాపము గలుగలేదు.

తే. గీ. పరిభవానలమునఁ గాని ♦ నరులగర్వ
మణఁగ దప్పుల నిప్పు చ ♦ ల్లారినట్లు
దెబ్బలను దిన్నహృదయమే ♦ తీరుచుండు
రాతిదెబ్బల గోరింట ♦ రఁగొసంగు.

అభ — నిజమే కాని, యింతమాత్రాన —

గుణ —

చ. కలధన మెల్ల వేశ్యలకు ♦ గాదులఁ బోసితి వారి కల్లుకుం
డలకు సువర్ణపేటికల ♦ డాగి పటాగ్రము లెత్తి గజ్జెలం
దెలకు శిరంబు మోపి పర ♦ దేశిని గానని బొంకు కట్టి యా
వల వలపింప నావలపు ♦ వడ్డికిఁ బారఁగ వేలుపోసితిన్.

ఇట్టు లున్నదంతయు సమర్పించితిని.

తే. గీ. ఇంకఁ దృణమైన వచ్చు దా ♦ రేది లేదు
కాసు వీసంబు చేతిలోఁ ♦ గానఁబడదు

ఏమిసేయుదు ననున్నైన • నెంపోదు
ఇట్టిగతి వచ్చునని కల • నెఱుఁగనైతి.

ఆహా! నేను మధువు ద్రాగితిని. నాధనము మధుభాండము లాగి వేసినది. నాహూకలు రోజెలంది నాకిచేసినది. నాయాకలి నన్నిప్పుడు చీకాకు సేయుచున్నది. కాని నాకడ కానిద్దైన లేక భీకరమగు వ్యాకులముల కాకరమైపోవుచున్నాఁడను. ఇఁక కేకలువేసిన నాకర్ణించు వా రెవ్వరు? ఆకాశము చూచిన శోకము పోవునా? ఆహా! నేను మున్ను జ్ఞానమహాసభ్యుఁడనై బ్రహ్మానందవారాశి నోలలాడి దుష్టుల సహవాసమున చార్వాకుఁడనై జగన్మిథ్యావాదినై తుద కీవేశ్యలచే పరాభవదవానలమున మాడి మసినై పోయితిని. నాయవజ్ఞతకుఁ జింతించు చున్న నన్నాదరించువా రెవ్వరు - తోడ్పడువా రెవ్వరు?

పా ట

1

దేవుఁ డెప్పటి కేది తెచ్చిపెట్టునో గాని
ఏవేళ కేది రానున్నదో
ఈవింత లీకన్ను లీక్షించునని యెరుగ ॥దే॥

2

తగుదునని రేన్నాళ్ళు
తలయెత్తి తిరిగి యొక లిప్తలో కాలనిహతి
తెగి నేలఁగూలి యీలీల విధి జం
బాలపటలంబుల
వగఁ గూరి కూరి యీ
నగవులపాలైతి నిఁక నెన్నాళ్ళకైన నా
మొగము జగమున కగుపర్చగా గలనె యహా! ॥దే॥

భవు — పాప మీనాకనిదుర్దశ యశ్రువులురాల్పవలసినంత శోచనీయ ముగా నున్నది.

అథ — కాని యిట్టి కుమతుల హృదయమున నీతి మంచువలె విడిపోయి హారతివలె నెగిరిపోవును.

తే. గీ. జొన్నకర్రలు తియ్యగా ♦ నున్నఁగాని
బెల్లమేరీతి గాదో యా ♦ విధము దలఁప
ఖలులహృదయాలలో నీతి ♦ నిలువఁబోదు
బోడితలను బంతులు జారి ♦ పోవునట్లు.

(తెర)

## తృ తీ యాం క ము

రంగము — గంగాతీరము

(సోమపాదుఁడు, కళ ప్రవేశించియుందురు)

సోమ — చెలీ! మన మిప్పుడు సురలకు గాణాచియైన వారణాశి ప్రవేశించినాము. చూచితివా! ఈ గంగాభవాని యెంతసొంపు సంపాదించుచున్నదో, ఆహా!

సీ. ఈగంగయే సుమీ ♦ యారేవులోఁకాలఁ
జెన్నారి పూతంబు ♦ సేయునదియు
ఈగంగయే సుమీ ♦ యాశ్వరఘనజటా
జూటంబులోఁ దోలగి ♦ చూచునదియు
ఈగంగయే సుమీ ♦ యిల జహ్నుకడుపున
నుదయించి యుర్విఖ ♦ లూరునదియు
ఈగంగయే సుమీ ♦ యొసఁగి భీష్మునివంటి
వరమహామహు నాత్మ ♦ బడసినదియు

తే. గీ. కోటి [illegible] ♦ [illegible]ధుండు
[illegible] ♦ [illegible]యు
అట్టి యీ[illegible] ♦ యుపుమువాయు
[illegible]తలు [illegible] ♦ [illegible]మనదియు.

మఱియు జేటి! [illegible]కింపుము. ఎంత రమణీయ మైన దృశ్యమో. ఆహా!

ఉ. [illegible] ♦ బూచినపువ్వులు పండ్లఁజిక్కి న
స్నదము [illegible] ♦ నోజ్ఞములై రతవాలలీల నిం
పొదవుచు [illegible] ♦ [illegible]మునన్నవో చూచితే సఖి
ఇదె నిజమైన త్యాగ మని ♦ పించుఁ బ్రియార్థము ప్రాణమిచ్చినన్.

భవుఁడు — (ప్రవేశించి) [illegible]లోకమునుండి జగద్వ్యాప్తమై వచ్చుచున్న అధ్యాత్మిక జ్ఞాన మహాభక్తుల ధర్మదీక్ష నగ్నిపరీక్ష సేయ దేవేంద్రాదులచే నియోగింపఁబడి పెక్కు మహాభక్తుల దివ్యచరిత్రములవలోకించి వచ్చినాఁడను. గుణా[illegible]టి గుణహీనులు, చ్యుతసంస్కారు లెవ్వరో [illegible] తక్కినవా రెందరో మహనీయు లున్నారు. నేఁడు [illegible] పరీక్షింపవలయును. ఆహా! వారీవంకకే వచ్చుచున్నారు. నేను ప్రచ్ఛన్నముగా నిలిచి వారి వర్తనము చూచుచుండెదను (అని ప్రక్కను నిలుచును).

(గుణసత్తుఁడు చేపలవాండ్రును ప్రవేశించుదురు)

గుణ — ఓహో! మా అన్న సోమపాదుఁడు మావదిన కళ యీ వంకకే వచ్చుచున్నారు. వీరు నావలన నిట్టి దుస్థితికి వచ్చి యీతీరున తిరుగాడుచున్నారు. అహా!

చేపల — (వడవలపై చేపలు పట్టుచు పాడుదురు)

గుణ — (స్వ) నా జీవితమున కిది తిరిగి మూఁడవ రంగము ప్రారంభ

మైనది. నేను చంచలచేత ప్రాభవింపఁబడి లేచి వచ్చి యీగంగాతీర మాశ్రయించి చేపలవాండ్రలోఁ గలసిపోయి యీ పని నవలంబించితిని. ఇంక ముందేమి కానున్నదో తెలియదు. నన్నీవరును గుణదత్తుఁ డని పోల్పలేరు.

(పట్టినచేపలు రానులుగాఁ బోయుదురు)

గుణ — ఓరీ! వీని నన్నిటిని విక్రయించి సొమ్ముతీసుకొనిరండు.

చేప — చిత్తము స్వామి!

కళ — నాధా! జేనెడుపొట్టకై యిన్ని మీనముల ప్రాణముల నాహుతి నేయవలయునా. అయ్యయ్యో, వీరికేల దయలేదు.

ఉ. ప్రాణముకన్నఁ దీవు గల • దా వలదా దయ ప్రాణికోటిపై,
ప్రాణుల నెల్ల నొక్కటిగ • దా పశు వేమి మనుష్యుఁ డేమి యీ
మీనము లిన్ని చంపి తమ • మేనులు పెంచుటకంటె రొట్టె నే
దేని భుజింపరాదె తగ • దే సుకృతంబు మనుష్యజన్మకున్.

గుణ — ఓహో! నీవు బౌద్ధభిక్షుకివలె నున్నావు. నే నీ జాలరులకు నెకిమీఁడను. నాకీచేపల నమ్ముకొనుటయే వృత్తి. నీ ధర్మోపదేశముల విని నేనీపని మానితినేని హఠాత్తుగా ప్రాణత్యాగముఁ జేసుకోవలసినదే. నాకిది తప్ప వేరుగా జీవనాధారము లేదు.

కళ — నాయనా! పుట్టించిన దేవుఁ డన్నము పెట్టఁడా. హత్యయే జీవనాధార మనుట శోచనీయముగదా.

ఆ. రాతిలోని కప్ప • బ్రతుకుచు నున్నది
చదల నెగిరి బ్రతుకు • చాతకంబు
స్థావరములు కదలి • చనకుండ బ్రతుకును
మనము శాకభుక్తి • మనగలేమె.

గుణ — నీ నీతులకర్థములేదు. చిన్నచేపలను పెద్దచేపలు తినుచున్నవి. అట్లే,

తే. గీ. గుంటలో నుండు కప్పలు ♦ గొప్పఁ జూచి
యేఱ్లనుండెడి నీరాన ♦ కేఁగుదొక్కొ
వృషభమేఁ బులికిని జవల రాఁ ♦ బోవునకును
మాంస మశనంబు విధి పెట్టె ♦ మగుఁ గంటె.

కావున అహింస, అస్తేయంబుల కర్థము లేదు. మాంసమునం దెట్లు ప్రాణ మిమిడి యున్నదో శాకములయందును నట్లే కలదు. హింసలేని మానవజీవనము లేనె లేదు, అది లేని బ్రతుకున కర్థము లేదు. ఉపాధి యున్నంతవఱకు నువాదేయమైన భోగములు వర్జింపఁజనదు.

తే. గీ. పనులు సరున్న చోటికి ♦ బరువు వెట్టు;
చీము కలగండగల తావు ♦ చేరు చుండు
కోకిలము మావిచిగురుల ♦ గూర్చి పోవు
మధుపరాజంబు తేనెకై ♦ మసలుచుండు
ఉదర మెవరికైనను వీడి ♦ యున్న దొక్కొ
పిండివంటలు సంసారి ♦ వండి తినిన
ఆకులంబులు సన్యాసి ♦ యారగించు
క్షుత్తునకు నిర్వ్యరోకటె జ ♦ గత్తునందు.

ఓరీ, దాసరీ! అవల యిటు తెమ్ము, అందలి పెద్దపెద్ద చేపలను బల్లెము గ్రుచ్చి చంపుదము.

కళ — అయ్యో! ఇది మహాపాపము గాదా?

గుణ— పాప మనునది లేనేలేదు. మానవులు తృణయవవ్రీహ్యాది రేతోరూపమున మాతృగర్భమునుండి వచ్చుచున్నారు. ఇసుకనుండి బంగారము పైకి పుటములు పడివచ్చును. దాని నిప్పుడు దగ్ధకాష్ఠన్యాయమునఁ జూడవలసినదే కాని బంగారు కణికలో నిసుక కలిసియున్నదా

లేదా యని విచారింపఁజనదు. అట్లే మానవుల కాగామి సంచితములు నిమిత్తమాత్రములు.

సోమ — మానవులు కర్మబద్ధులు కారా?

గుణ — అట్లనువారివి మెట్టవేదాంతములు. సృష్టి సమస్తము పరిణామముపై మోసియున్నది. నిన్న నాకులతో పచ్చగా నున్న బంతిచెట్టు నేడెఱ్ఱనిపువ్వులను పూయుచున్నది. నిన్న నీళ్లో యని పండ్లికిలించిన శుక్తి నేడు గర్భమున మౌక్తికముల ధరించుచున్నది. అట్లే దేనికిని కర్మప్రధానము గాదు. కాలమే కారణము.

కళ — సరే! కాలమునకైనను వెఱవవలదా?

గుణ — మానవుఁడు స్వతంత్రుఁడో పరతంత్రుఁడో తెలియదు. ప్రవాహములో కొట్టుకొనిపోవు కాష్ఠము తెరఁగున కాలప్రవాహమున బడి ఆశాలతల నడుమ నిరికి ఊహాలను ఘుంఘుమారుతమునకు శర వేగమున కొట్టుకొనిపోవుచున్నాఁడు. ఎంత వెఱచినను మృత్యువు తప్పదు.

కళ — కావుననే సుకృత మాచరింపవలయునని నానిశ్చయము.

గుణ — సుకృతమా? ఇష్టోపభోగములే సుకృతములు! గడ్డియై మేయఁబడుటకంటె పశువై దానిని కొఱుకుట లెస్స. కొఱికెడుపన్నును కొఱుకఁబడు గడ్డియు జడములే కాని కొఱికినపన్ను దానిరుచి ననుభవించి జన్మము సార్థకము జేసికొనుచున్నది.

సోమ — ఇంక మానవులకు ధర్మార్థకామమోక్షము లను పురుషార్థములు వలదా?

గుణ — అగ్నియం దుష్ణశక్తి, రాతియందు కఠినశక్తివలె పురుషార్థములు వానియంతనవే వెంబడించుచుండును. జీవునకు సుఖమే గాని, దుఃఖము లేదు. రాగమే గాని విరాగము లేదు. వేడుకయే గాని వేడుకొనుట లేదు. నిన్నటికి నేఁడొకదినము ముదిమి ఆవహించినది. తే పనునది లేదు. ముదిమి మేనుపై ముసుగు వంటిది.

కం. బాల్యము వచ్చును జను; గై
వల్యమువలె యౌవనంబు ♦ వచ్చును బోవున్
తుల్యములేనిది రుజచె
నైల్యంబగు ముదిమి వచ్చి ♦ నన్ బోదునుమీ.

కళ — ఆవల పాపాత్ములు యమదండమునకుఁ బాల్పడవలసి వచ్చును గదా.

గుణ — అది పట్టిది. మరణానంతరము చితిని పేర్చువాఁడు రక్తారుణాక్షులతో సంక్షుభితమైన కరవాలము చేత పట్టుకొని కట్టెల నఱకుచుండును. వాఁడే యమదూత. వాని చేతిలోని క్రూరకృపాణమే పాపపుణ్యములను తూఁచు తక్కెడ. ఆ చితియే అన్నిటికి స్వస్తిదప్పు మంత్రపేటిక. ఆ మహారావశేషితమైన బలివేదికయే యమధర్మరాజు సింహాసనము. జీవుఁడో. అస్తిపంజరమున ప్రోగుపడిన మృత్తికారేణు సముదాయము. ఆత్మ శరీరమును వదలి యొక్క పెద్దగంతు వేసి వాయ్వాదులలోఁ గలసిపోయినప్పుడు, తేజములో తేజము మిళితమై పోయినప్పుడు, ఇంక దానిని పట్టికొనివచ్చు నెఱజాణఁ డెవ్వఁడు? ఇంక స్వర్గ మెవనికి; నరక మెవనికి? ఈశ్వరభక్తికిని ముసలమ్మ కథలకును భేదములేదు. తిని నిర్వ్యాపారముగఁ గూర్చున్నవారు వ్రాసినవే పురాణములు. వానిలోని సారమే ఉపనిషత్తులు. వేదాంతము బని బ్రహ్మసూత్రములు వ్రాసినాఁడే గాని, ఆత్మస్వరూప మిదమిద్ధమని నిరూపింపలేక సర్వాంతర్యామి యని యథోచిత నాస్తికవాదములోనికి దింపి మఱింత అంధకారములోని కీడ్చినాఁడు. ఇవి యేమియు నర్థములుగావు.

సోమ — ఇది పదార్థవాదము. నిరీశ్వరుల కాశ్రయమైనది. హేతువాదమువలన నిర్వాణము రానేరదు. నిర్వాణ మొక యపురూపమైన అమృతపదార్థము. దానికై యత్నించుట సమంజసము.

గుణ — సరే. మీ ప్రశ్నే యనుకొనుచుండుదును. అఱువులు సమ్మి స్థిరములు వదలివేయు మీ బుద్ధి గగనాదుల కాశ్రయమైన శశవిషాణ ప్రాయ మైనది. మరుమరీచికలవలె బాధాభూయిష్ఠమైనది; వ్యర్థమైనది.

సోమ — ఈతఁ డెవఁడో బాగుగఁ జదువుకొన్న భావతార్కికుఁడు. మిథ్యావాది. శూన్యుఁడు.

గుణ — నేను శూన్యుఁడనే! నాకీ సృష్టి సమస్తము శూన్యము. అందులో నేను ఆస్తికముగా నుపాస్య మగుచున్నా నని నీ వెఱుంగవు.

సోమ — శుచిని గోల్పోయి, విధినిషేధములకు స్వస్తిచెప్పి మీన భుజుఁడవై వేదాంతిములు పలికెద వీ వెంత లజ్జాహీనుఁడవు!

గుణ — అగును, నేను లజ్జాహీనుఁడనే. నీవు నావలె పడిపోయి నప్పుడుగాని తెలిసికొనలేవు.

సోమ — ఇంకను నేను పడిపోవలసిన అగచాటు లేమున్నవి?

గుణ — మానవున కేస్థితియందును నిమ్నత్వ మున్నది.

(అని పడవ త్రోసికొని జాలరులతో పోవును)

కళ — పాపభీతి లేనివా రందఱిట్టి దుర్గతుల పాలై పోవుచుందురు. ఎవరికర్మము నెవరు దిద్దఁగలరు.

సోమ — సరే. మన ముందుగతి యేమో ముందు విచారింపుము.

కళ — ఆహా! ఆమె యెవతెయో యెఱుకసానివలె వచ్చుచున్నది. ఆమె నడిగి తెలిసికొనియెదను.

సోమ — సరే.

ఎఱుకత — (ప్రవేశించి, స్వ) నేను 'జటు' పేర వరఁగు చంచలను. నే డీయెఱుకసానినై వీరి కేదో త్రోవ చూప వచ్చితిని. (ప్ర)

తే. గీ. జిలిగింజలు, మోదుగు ♦ మోడ, సూది,
ఆలుమగలకు పతిము వ ♦ శ్యౌషధములు

నల్లపూసలు, చపలవు ♦ రాళ్ళ, పచ్చ
బొట్లు కావలెనా మీకు ♦ బొట్టెలార!

సోమ —

తే. గీ. నెత్తిపై గంప, కుంకుమ ♦ మొత్తిపట్టి
నుదురు, మెడనిండఁ బూసలు ♦ గుగ్గు పొట్టి
చీర, కెంపులహారాలు ♦ తోరణములు
శ్రుతులఁ గమ్మలు, కొమ్ముగా ♦ జాలువాల్చు
నీవెవరు తల్లి! యీదారి ♦ నేఁగుచుంటి
వెఱుక చెప్పక పోయెద ♦ వెవరనమ్మ!

కళ — ఆఁగుమాఁగుము.

ఎఱు —

తే. గీ. జీడిగింజలు, మోదుగు ♦ పూఁత, సూది
లాలుమగలకు పతేము వ ♦ శ్యౌషధములు
నల్లపూసలు, చపలవు ♦ రాళ్ళ పచ్చ
బొట్లు కావలెనా మీకు ♦ బొట్టెలార!

కళ — నీవెవరవు?

ఎఱు — నేనా! చెప్పితిని గదా.

సోమ — మీ కుల మేది?

ఎఱు —

తే. గీ. ఎఱుక బ్రహ్మాదులకు నైన ♦ నెఱుక పడదు
నెఱుకె సర్వంబు నెఱుకకు ♦ మఱవు లేదు
ఎఱుకల కులంబు నాది; నే ♦ నెఱుకసాని
నెఱుకఁ జెప్పిన లోకమ ♦ చ్చెరువు నొందు.

కళ — ఆహా! ఎఱుకమ్మతల్లీ! నీవు మాపూర్వపుణ్యవశమున భవాని

వలె ప్రత్యక్షమైనావు. మేమెంతయు ధన్యులముగదమ్మా. మాముందు గతి యేమో తెలిపి పుణ్యము గట్టుకొనుము తల్లీ.

ఎఱు — ఎఱుక చెప్పుదును.

కళ — అదే మాకు కావలసినది.

ఎఱు — (రాగ మాలాపించి)

ద్విపద

ధర్మార్థమై యెల్ల ♦ ధనము గోల్పోయి
అడవులఁ బట్టితి ♦ రాజదల్ చెంది —
కట్టె లమ్మి బ్రతుకు ♦ గడపుఁడీ ముందు
దైవంబు తోడ్పడుఁ ♦ దప్పక యిందు -

కళ — కట్టె లమ్ముకొనుమన్నావా? సరే.

ఎఱు — కట్టె లన్ని కనకాలౌతవి! కనకాలుంటే లోకా లున్నాయి. (అని వెళ్ళిపోవును)

సోమ — కళా! మన కీసోదెలతో నేమిపని? మన కీశ్వరుఁడే శరణ్యము.

కళ — నాథా! మీరన్నది నిజము. కాని, యీయెఱుకసాని తప్పేమి చెప్పినది? మనమనుకొనని బ్రతుకుదెఱువొకటి చూపించి వెళ్ళిపోయినది.

సోమ — అగు నగును.

కళ — కట్టె లమ్ముకొనుట కన్న నిప్పుడు నిర్ధనులమైన మన మేమి చేయఁగలము?

సోమ — అగును (అని రెండడుగులు నడిచి) దేవీ! నీవిట నుండుము. కట్టెలు నఱుకుట కీజానపదమున నెవరినైన బతిమాలి గొడ్డలి యెరువు తీసుకొని వచ్చెదను. (అని వెళ్ళి గొడ్డలి చేతపట్టుకొని వచ్చును) దేవీ! ఈయడవిని ఎండుకట్టె లెందును గానరాకున్నవి.

తే. గీ. ఎండుకట్టెలు గావరా ♦ వెండఁ గన్న
పచ్చికట్టెలు నరికినఁ ♦ బాపమండ్రు
ఇల నహింసావ్రతము వ ♦ హించువారి
కడుగు మోపుటకైన సా ♦ ధ్యంబు గాదు.

కళ — నాథా! ఈనదిలో నొరఁగిన చెట్టుచివరకొమ్మ లెండిపోయినవి.

సోమ — అగును! నా యాశాలతలు గూడ నట్లే యెండిపోయినవి. (అని యెక్కి కొట్టఁబోవును. గొడ్డలి జారి నీళ్ళలో పడిపోవును.) దేవీ! నాగొడ్డలి నదిలో జారి పడిపోయినది. ఆహా! దైవమా మమ్మెన్ని పడరాని కష్టాలపాలుఁ జేయుచున్నాఁడవు.

కళ —

తే. గీ. పొలములా పోయె బంగారు ♦ పోతపోసి
నట్టి పాత్రలు పోయె భా ♦ గ్యములుపోయె
నింక నినుపగొడ్డలి వగ ♦ పేటికయ్యె
కాన డాగినఁ గష్టాలు ♦ గడవఁగలమె?

సోమ — దేవీ! నీవన్నది నిజమే కాని నామనస్సు మిగుల వేదనా దోదూయమానమై పోవుచున్నది.

సీ. ధనము పోయిన భూరి ♦ కనకంబు పోయిన
కన్నీటిచుక్క నేఁ ♦ గార్పలేదు
గృహము గోల్పోయిన ♦ విహితులు వీడిన
మనసులోపల నింత ♦ కినియలేదు
స్వస్థాన మెడలిన ♦ స్వజనంబు వదలిన
భోరున దుఃఖింపఁ ♦ బోవలేదు
కూటికి లేకున్నఁ ♦ గోమలి యేడ్చిన
ఈశ్వరా యనుచుఁ జిం ♦ తింపలేదు

తే. గీ. ఎరవు తెచ్చినగొడ్డలి ◆ యేటియందు
జాగె సొమ్మిచ్చువార లే ◆ నేనపుడంచి
నిందసేయుదురో యని ◆ కుందుచుంటి
ప్రాణి పోవచ్చుఁగాని పో ◆ రాదు పరువు.

కళ — నాథా! మనకు దైవము లేఁడా?

సోమ — దేవీ! మనకు గొడ్డ లెరవిచ్చినవారు మీ గొడ్డ లేటిలో పడిపోయిన దన్న నమ్మరు. ఈనాటక మైన కూటికి లేక అమ్ముకొని తినినా మని బహువిధముల నిందించెద రవి యెట్లు భరింపవచ్చును.

పాట

1

ముందుగతి యేమింక నా విధి
యెందుఁగలఁడు మాకింకన్

2

ఎండవానల కొండ కెక్కి యీ
యెందుకష్టల యేరి బ్రతుకు మా

3

ఆపదలందున నాపద లిడు విధి
కోపదవాగ్ని కే మోపఁగలమె మా ॥ముం॥

కళ — నాథా! నన్నంగడిని విక్రయించి మీగొడ్డలిఋణము తీర్చి వేయుఁడు.

భవుడు — (ప్రవేశించి) ఆహా! తల్లీ! నీవే కులకాంతవు.

గీ. లెక్కలేనంతధనము లా ◆ లించి లాగి
తన్ని పోవును వేశ్య కృ ◆ తజ్ఞ యగునె
లెక్కలేనంతధనము త ◆ ల్లి నడిగిచ్చి
తనువు నర్పించు భార్య కృ ◆ తఘ్న యగునె.

సోమ — దేవి! నిన్నమ్మివేయుమందువా? అదియును సులభసాధ్యము గాదు.

తే. గీ. సతిని విక్రయించిన పాపి • స్వామిద్రోహి సంక్ష
యాడనా నీవు నిన్నమ్ము • నాఁడు రాజ
భటులు దండింత్రు నాని స • త్యవ్రతుఁ డని
కాన కష్టాలమార్గాలు • కానరావు.

భవు — పాపము పిల్లి దీనిలో నాహారమగుటకు నీరుఁ జేసి వేయుచున్నది. (అని పాత్రలో నుండి బంగారుగొడ్డలిఁ దీసి) సోమా! పాడుఁడా! యీ బంగారు గొడ్డలిఁ దీసికొని పొమ్ము (అని యిచ్చును).

సోమ — (పరిశీలించి) దేవీ! మనకు దైవము ఇనుప గొడ్డలికి మారుగా బంగారుగొడ్డలి ప్రసాదించినాఁడు చూడుము.

కళ — నాథా! మనకు పోయిన ఇంగారము కన్న నీ బంగారము ఘనము గాదు. ఇది యెవరిసొత్తో వారి కిచ్చి మన యినుపగొడ్డలి నడిగి కొని తెండు.

సోమ — (భవుని సమీపించి) దేవా! నే నపరాధిని! నాది యినుప గొడ్డలి. ఇది పుచ్చుకొన్నందుకు క్షమింపుఁడు. (అని యిచ్చివేయును)

భవు — (అది నీళ్ళలో పాఱవేసి వెండిగొడ్డలి తీసి) ఇదిగో! వెండి గొడ్డలి తీసికొమ్ము.

సోమ — దేవా! ఇదియును నాది కాదు. నా యినుప గొడ్డలినే నా కొసంగుము;

తే. గీ. ఏది తన వస్తువో యది • హీనమైన
నధికమైనను నానంద • మగును గాని
ఎఱువువస్తువు లన్నియు • బరువుచేటు
లన్న లోకోక్తిలో నీతి • యున్న దనఘ!

గుణదత్తుఁడు — (ప్రవేశించి) స్వామీ! మీరు పాఱవేసిన గొడ్డళ్లు నా కిచ్చివేయుఁడు.

భవు — నాయనా! దురాశ నీ కింకను వదలలేదు. ఆశించిన వన్నియు రావు.

మ. ధనవాంఛన్ విడనాడి తేని ప్రతిపా ♦ దంబందు వేవేలుగా
ధనరాసుల్ లభియించు; లేనియెడ న ♦ ర్థం బర్థి రాఁబోవ దే
మనుజుం డున్న తృణంబు మేరువుగ సం ♦ భావించునో యాతఁడే
ధనికుం; డేడ్చెడువానికిన్ ధనము వ్య ♦ ర్థం బెంతగా నుండినన్.

(అని బంగారు, వెండి, ఇనుప గొడ్డళ్ళు సోమపాదున కిచ్చి) సోమపాదుఁడా! నేను దేవమాతను. ఇవి నేను ఆశీర్వదించి యిచ్చితిని (అని నిష్క్రమించును).

సోమ — దేవీ! చూచితివా! ఈశ్వరానుగ్రహము!

శా. దైవంబే యిడెనేని యీ ధనములో, ♦ ధాన్యంబులో, మాడలో,
ఏవో చేటలఁ గుమ్మరించు; నవి మా ♦ యీ రెండు దోసిళ్లఁ గై
కోవాలన్నను జాల వీ తెఱఁగులన్ ♦ గుర్తింప కీమర్త్యులే
వేవో యత్నము లాచరించెదరుగా ♦ రే దేవు నర్థింపకే!

గుణ — (స్వ) దేవతలకుఁగూడ పక్షపాత మున్నది. ఆహా! మళ్ళ కొలఁది బంగారమునుగకయే యీ భవుఁడు సోమపాదున కిచ్చి వెళ్ళిపోయినాఁడు. నేనెంత ప్రార్థించి బతిమాలి యేడ్చి మొత్తుకొన్నను నాకొక తృణమైన నియ్యఁడాయెను. ఎంతవిపరీతము. నేను మాత్రము మనుష్యుఁడను గానా, నాకు మాత్ర మేల యియ్యక పోవలయును? వర్షము సస్యములపైఁ బడి కంచెలపై మానివేయునా? సరే! యీ ధనము సోమదత్తునకు దక్కనివ్వనుగదా! చూతము.

తే. గీ. ధనము మూలంబు లోకజీ ♦ వనమునకును
పుడమి ధనహీనుఁ డెన్నఁడైన ♦ పెట్టలేఁడు

తత్త్వవేత్తలు ధనము దం ♦ డన మటన్న
భీష్ముఁడంతటివాఁడు సే ♦ వించె తెరువు.

కావున ధనమేకీర్తినైన సంపాదింపఁగలయది. ఈ దినములలో ధనమున్నవాఁడే ఘనుఁడు. ధర్మమార్గమున ధనము రాదు. ధనమునకై యేమేమో మహాద్రోహములు సేయుచుందురు. ఇప్పుడు సోమపాలుని యొద్ద గల ధనము దొంగలచే దోఁపించెదను, తప్పదు. ఇదే ప్రకృత కర్తవ్యము (అని నిష్క్రమించును).

సోమ — నీ శాంతశమదమాద్యనంతకళ్యాణగుణములే యీనితాంత దురంతదుఃఖ మహాసముద్రమును తరించు నౌకలై పరిణమించినవి. లేనిచో మన దరిద్రము తొలఁగునది గాదు.

కళ — నాథా! మన కీశ్వరుఁ డయాచితముగా నొసఁగిన యీ ధన మక్షయము.

తే. గీ. ఎండవానలఁ గష్టిల ♦ నెత్తి నెత్తి
మోసికొని జీవనంబులఁ ♦ బుచ్చు మనకు
వెండి బంగారముల నొడి ♦ నిండఁ బోసె
నీశ్వరుని యీవి కరయ సం ♦ తేమి కలదు!

గుణదత్తుడు — (దొంగలతోఁ బ్రవేశించును) వీరలు దొంగలలో ఘనులు.

దొంగ — మేము దొంగలలో సుప్రసిద్ధులము. దొంగతనము అరువదినాలుగు కళలలో నొకటి. ఇది రాజుల కులవిద్య. వారు ఊళ్ళు, మేము ఇళ్ళు దోఁచెదము. కావున రాజులకును మాకును దోపిడిలో సామ్యతగలదు. మఱియు కవులు రసమును, మహాఋషులు స్వర్గమును తరుచు దోఁచుకొనుచుందురు. వారు మానుండియే ఆ విద్య నేర్చుకొన్నారు. మా విద్యలో శ్రీకృష్ణుఁడు వెన్నదొంగ!

సోమ — కళా! వీరెవ్వరు?

కళ — మనవంటి బాటసారులు.

సోమ — అయ్యో! నీవెఱుంగవు. మనధనలక్ష్మిని దోచుకొనుటకై వచ్చిన దొంగలు కారుకదా.

కళ — నాథా! ఈ భావము మనయొద్ద డబ్బు లేనప్పుడు కలుగలేదు. అప్పు డందరుమానవులు మానవులవలెఁ గనుపించిరి. ఇప్పు డందఱు దొంగలవలెఁ గనుపించుచున్నారు.

సోమ — నిజము! నిజము!

తే. గీ. పామువిష మెక్కునట్టు లీ ♦ హేమవిషము
మనుజ తత్త్వంబుఁ జంపివే ♦ యును సుమండి
అర్థహీనుని ధనవంతుఁ ♦ డరయలేఁడు
ధనికు లందరు కలుషాత్ము ♦ లనగవలయు.

కళ — నాథా! మార్గశ్రమచే నా కేమో విశేషముగ నిద్ర వచ్చుచున్నది.

సోమ — ఈ బంగారము మన మెడలోఁ బెట్టుకొని నిద్రింతము. రేపింటికిఁ బోయి మనము పూర్వముచేసిన అప్పులు తీర్చుకొందము. దాన మన ఋణవిముక్తి యగును. (అని నిద్రించెదరు)

గుణ — ఓరీ! చోరశిఖామణీ! చూచెద వేమి.

దొంగ — సమయము చూచుచున్నాము. (అని కొల్లగొట్టుదురు)

గుణ — (కళ నెత్తుకొనిపోవును)

( తెర )

## చతుర్థాంకము

రంగము — అంగడి

(గుణదత్తుఁడు, కళ ప్రవేశించియుందురు)

గుణ —

తే. గీ. ప్రాప్తమున లేని తృణమైన ♦ రానిమాట
నిజము; ప్రజ నేయుయత్నాలు ♦ నిష్ఫలంబు

విధివిభాసంబు మారదే ♦ విశ్వగురునైన
ముత్తైదు లకర్థి మునిఁగిన ♦ నష్టఁబ్బు.

ఆహా! నేను చేసినయుక్తి యంతయు వ్యర్థమైనది! నేను తిరిగి సోమ పాదుని ధనము దొంగలచే దోపించినాను. కాని, ఆ దొంగలు నా కొక వీసమైన నియ్యక మోసముచేసి తీసుకొనిపోయినారు. నాకీ 'కళా' దొఱికినది. ఈమె నీయంగడిలో దాచినగ విక్రయించి వచ్చినంత ధనము చిక్కించుకొని పోయెదను.

కళ — అన్నా! నీకేమి యుపకారము చేసినామని మమ్మీ రీతిని వ్యథలపాలు చేయ సమకట్టినాఁడవు. అయ్యో! నీవాకుతోఁడునఁ బుట్ట లేదా. నీకు దయ, దాక్షిణ్యము లేదా? నన్ను నా భర్తతో నేల యెడబాటు గావించితివి. ఇప్పుడు నన్నెచ్చటకుఁ గొంపోవుదువు?

గుణ — నన్నేమియు ప్రశ్నింపక నాతో రమ్ము.

కళ — అయ్యో! ఇట్టి క్రూరకర్ముఁడవు నీ వెట్లు జ్ఞానసభలో చేరితివి.

గుణ — నేను చేఁతినా? అది యొక యెత్తు. నే నిట్టి వెన్నో సభలలోఁ జేరి స్వలాభ మున్నంతవఱకు మహాభక్తునివలె నటించినాను.

కళ — ఛీఛీ! నీ వెంత కపటాత్ముఁడవు.

గుణ — అదే యిప్పు డక్కఱకు వచ్చినది.

తే. గీ. కపటభక్తులె గౌరవ ♦ పాత్రు లగుచు
పేరు పొందుచు నున్నారు ♦ పృథ్వియందు
ఎంత త్రాగిన నంతవే ♦ దాంతియంత్రు
ఎంత బొంకిన నంతమ ♦ హాము యటంత్రు.

కళ — ఉలవపాదు పందిరెక్కినట్లు మాయ యెంతకాలము చెల్లును?

గుణ —

తే. గీ. పరముసంగతి దేవుఁడే ♦ యెఱుఁగు నిప్పు
డిహాము హాయిగా జరుఁగఁగా ♦ నిమ్మ ముందు

అనువుకన్నను రొక్కమ్ము ♦ మెఱుఁగు గాదె
స్వర్గమున్నదో లేదో యె ♦ వ్వరికిఁ దెలియు.

కళ — నీవు చార్వాకుఁడవై చెడిపోయిన పాపంముఁడవు. నీతో వాదమేమిటి? నన్నిప్పు డెచ్చటకుఁ గొనితెచ్చితివి?

గుణ — అంగడికి.

కళ — ఎందుకు?

గుణ — అమ్ముటకు.

కళ — ఎవరిని?

గుణ — నిన్నే!

కళ — హాతోస్మి (అని నేల వ్రాలును).

గుణ — (స్వ) ఈమె నేత్రృణమునకో విక్రయించినఁగాని లాభములేదు.

కళ — (లేచి) హా! దైవమా, చూపరాని దృశ్యము లన్నియు చూపుచున్నావు. ఇందు నావంటి దురదృష్టవంతు లెందరో అగుపడు చున్నారు. హా!

సీ. తల్లిదండ్రులనుండి ♦ తనయుల విడిపించి
యూరించి యదె ♦ అమ్ముచున్నవారు;
అతిలోకసుందర ♦ లైనకాంతలఁ దస్క
రించి వేడుక విక్ర ♦ యించువారు;
ముకుపచ్చ లారని ♦ ముద్దుబిడ్డల దొంగి
లించి దుష్టులకు న ♦ ర్పించువారు;
అత్తింటికోడండ్ర ♦ నక్కటా యదె యాచి
కొని తెచ్చి కులటలఁ ♦ గూర్చువారు;

తే. గీ. అహహ వీరెల్లఁ గావించు ♦ నార్తరవము
గగనమునుఁదాఁకి పగిలి ర ♦ క్తంబు గురియు

యమపురముకన్న నీ శిక్ష ♦ యాపణంబె
ప్రబలనరకంబు బానిస ♦ వర్తకంబు.

ఓరీ! దుష్టుఁడా, ఎంతఘాతుకకృత్య మూహించితివి. నీకింక పుట్టుగతు లుండవు సుమా.

చంచల — (ప్రవేశించి) నేఁడేమో యీ బానిసల యంగడి చాల కోలాహలముగా నున్నది. నేను నాకు మంచిబానిస దొరకవచ్చును. ఇంటి యాడిగంబులకు పగలును, రాత్రి రోవెలందిరై ధనమును సంపాదించుటకును నొక బానిస నిందు కొనుక్కొని పోవలయును.

గుణ — ఓ ప్రజలారా!

తే. గీ. గుణములకుఁ బ్రోవు; హితములు ♦ గూర్చుమిన్న
అడుగు మోపినచోట మ ♦ త్యాలు పండు
మాటలాడినచోట హే ♦ మంబు గురియు
సట్టి 'కళ'ను బానిసగఁ గొం ♦ టారె మీరు.

చం — ఇచ్చట నేవో క్రొత్తమాటలు వినవచ్చుచున్నవి.

గుణ — (పైపద్యమునే చదువును)

చం — ఓహో గుణదత్తుఁ డిప్పుడు బానిసవర్తక మారంభించినట్టు లున్నది. వీడెంతకైన సమర్థుఁడే.

గుణ — (చంచలను చూచి) ఓహో! ఈ ముండ యిక్కడే లాగు దాపురించినది. (అని పారిపోవఁ జూచును)

చంచ — గుణదత్తుఁడా! ఉండుముండుము. పాఱిపోవకుము.

ఉ. ముక్కు, మొగంబు నేరనటు ♦ మూలల డాగెద వేల రమ్ము పె
న్మక్కువ నాదుకౌఁగిటను మద్యము ♦ ద్రావుచు కేరి యాడుచున్
కక్కురుతిల్ వెలార్చికొని ♦ కష్టము మళ్ళిససొమ్ము లీయకే
దక్కితినంచు పోయితివి ♦ దాగుడుమూతల నాడె దేటికిన్.

(అని చీపురుతో కొట్టును)

గుణ — ఇక్కడ నీబండారముకూడ తెలిసినది (అని నిష్క్రమించును)

చంచ — (స్వ) ఈమె నా అక్క కళ! ఈ గుణశత్రు వెంత పాపమునకైన వెనుదీయదు! (ప్ర) అమ్మా! నీవు నా వెంట రమ్ము. నా యింట నీ కేమియు లోటు రాఁబోదు.

(తెర పడును)

## పంచమాంకము

రంగము — దారి

(సోమపాదుఁడు ప్రవేశించి యుండును)

సోమ — దైవికముగా ధనము వచ్చి నారికేళసలిలమువలె మాయమై పోయినది. పోయినది పోక ప్రాణప్రాయముగు నా కళను గూడఁ దీసుకొని పోయినది. నే నింక దేనికని బ్రతుకఁగలను. అయ్యో!

చ. కళ విడఁబోఁడి యీ పగిది ♦ కష్టపరంపరలందు రేబవల్
కలఁగి, కళావిహీనమతి ♦ గాసిలుచుంటి నిషిద్ధజీవితం
బలరఁ బ్రచండ దుఃఖశిఖి ♦ కాహుతిగా నిటు మేన ప్రాణముల్
గలిగినఁ జావునన్ బ్రతుకు ♦ గాదిది యేమని చెప్పుకొంటకున్.

నా కళను దొంగ లెత్తుకొనిపోయినారు. ఇంక జీవితమందు ప్రధానమైన నా కళ జారిపోయినది. కళావిహీనుఁడ నైన నేను బ్రతికియు జీవచ్ఛవమునై యున్నాను. ఇంక నాకు శాంతి యెక్కడిది. ఆహా! ఆకళ యెంత సద్గుణకళాధురీణ.

సీ. పతిమాట కెప్పుడు ♦ ప్రత్యుత్తరం బిచ్చి
కలహింప నొల్లని ♦ కలికిమిన్న
పొరిగింటివారి నె ♦ వ్వరి నొవ్వనాడ కే
ప్రొద్దు సంభావించు ♦ పుణ్యశీల

ప్రతినిష్ఠ లన్నీ! నీ ♦ శోభనా యన్న ప్రాణార్థ
ములు ధారవోసెను. ♦ ని దివ్యహృదయము
కలనైన నన్మరింబు ♦ పలుకఁ జేరవు మహా
ధన్యాత్మ సాధ్వీ జాం ♦ తప్రదీప

తే. గీ. సద్గుణంబుల కాణాచి ♦ సచ్చరిత్ర
అమృతసదృశి, సదానంద ♦ సముపేతాత్మ
ఓర్పు నేర్పులు కలిగిన ♦ యువిదమిన్న
కళను బోలిన కాంత లీ ♦ యిలను గలరె.

ఇంక నే నెంత వగచినను ప్రయోజనము లేదు. ఆ దొంగలే తీసుకొని పోయి యుండవచ్చును. ఆమె నిజానమును తెలసైన నెఱుంగుదురేమో!

చ. అనుగడు తానిక ... నౌక ♦ నైన నరే; ... కిన్వానన్
వెడలదు ... ♦ వేసిన ధైర్యమువీడ; దోపికన్
వినువను; తెప్ప నేయు దొక ♦ వీసము నైనను బొంక; దట్టి నా
పడతి కళాకలాప యుగ ♦ నష్టదె యెవ్వరికైనఁ జెప్పరే.

ఆహా! నా కింక కళ దూరమైపోయినది. నే నీజన్మలో నా కళను జూడలేను. ఇంక నా మిగిలిన జీవనము భూభారమునకే గాని వేరు గాదు.

సీ. కళను చూచితి రేని ♦ కరుణార్ద్రహృదయులై
చూపింపరే చంద్ర ♦ సూర్యులార
కళను గాంచితి రేని ♦ కనికరం బెదఁబూని
విడువరే క్రొమ్మెక్కెద ♦ విబుధులార
కళ నెఱింగితి రేని ♦ కాఠిన్యమును మాని
వచ్చి చూపరె మేఘ ♦ పంక్తులార
కళ గ్రహించితి రేని ♦ కపటంబు వర్జించి
దరిఁ జేర్పరే పుణ్య ♦ తరువులార

తే. గీ. కళను దొంగిలించిరె విహం ♦ గంబులార
కళను దాఁచికొంటిరె పన్న ♦ గంబులార

కళను జెరబట్టితిరె చోర ♦ గణములార
కళను బంధించితిరె నగ ♦ కులములార.

ఇంక నే నెంత యేడ్చినను ప్రయోజనము లేదు. ఈ దారి నూరి లోనికిఁ బోయెదను. (అని కొంత నడిచి) అదిగో నా పరిచితు లెవరో వచ్చుచున్నారు.

(వీరిసెట్టి — జంధ్యాలభట్టు ప్రవేశింతురు)

జం — ఒరే వీరిసెట్టి! దొంగ దొఱకినాఁడు.

వీరి — దొంగ దొంగ యనిన నా యొడలు కంపమెత్తిపోవును. అయ్యో! నా యిల్లు దోఁచుచున్నా రా యేమి?

జం — లేదు. ఈ దొంగ యిదివఱకే దోచినాఁడు.

వీరి — ఎవరండీ.

జం — ఇదిగో! సోమపాదుఁడు.

వీరి — ఆహా! ఏఁడీ! ఏఁడీ! పట్టుకొనుఁడు, పట్టుకొనుఁడు.

జం — పట్టుకొన్న నేనున్నది, పట్టెకుదుముగ్గులు.

వీ — (సమీపించి) సోమపాదా! మా డబ్బుమా కేమందువు?

సోమ — నాయనలారా! నేను బ్రతికి యున్న మీ ఋణము దీర్చుకొనక పోను.

జం — ఏమి సంగనాచికబుర్లు నేర్చుకొన్నావు.

వీ — నీ బ్రతుకు చావులతో మాకు పనిలేదు; మా ఋణము మా కిచ్చివేయుము.

సోమ — నాయొద్ద కాసైనలేదు. నే నెట్లు మీఋణము తీర్చఁగలను?

జం — భవాభవు లిచ్చిన గొడ్డం డ్రేమిచేసినావు?

సోమ — అయ్యో! అవే నాకొంప తీసినవి.

ఆ. కొత్తనీరు వచ్చి ♦ కొలనిగట్టును త్రెంచి
ప్రాతనీరును గొని ♦ పాఱినట్లు

స్వర్గవాసు లిడిన ♦ బంగారు కొప్పెరలి
కెట్టు కళను బొట్టఁ ♦ బెట్టుకొనియె.

పీరి — ఏమి విచిత్రము!

జం — నీ బొంకు లెవరు నమ్మెదరు? దేవతలు స్వయముగా నిచ్చిన ధనము నీ పెండ్లాని కిచ్చి యెక్కడో దాచి పైగా దొంగకబుర్లు చెప్పుచున్నావా?

పీరి — ఇవే ఋణము తెగఁబెట్టు మార్గాలు.

సోమ — హరహర! మీరు పాపము లాడవలదు.

చ. కళను హరించినార లొక ♦ కాసునకున్ గొఱగానియట్టి నా
వలన ఋణంబు దీరు టెటు ♦ లట్టిది; ఓ ఋణదాతలార! మీ
రలుగక సన్న సేవకుని ♦ యట్లె కొలం దడి చాలదేని కం
డలు తెగఁగోసి నా కళను ♦ దాచిన వీధిని విక్రయింపుఁడీ.

(అని నేలఁ బడిపోవును)

పీరి — ఇది మంచివేషమే.

జం — ఓరే పీరిసెట్టి! ఇదే మంచిసమయము. ఈ సోమపాదుని మన మిరువురము మోసికొనిపోయి యమ్మివేయుదము! నీవు కాళ్ళవైపు పట్టుకొనుము.

పీరి — తన్నునేమో!

జం — ఆలాగైతే తలవైపు పట్టుకొనుము.

పీరి — కఱవఁడా?

చంచల — (ప్రవేశించి) పాప మీతఁ డెవఁడో ఋణదాతల బాధ కోర్వలేక నేలఁబడిపోయినాఁడు. జీవచ్ఛవమువలె నున్న యీతనిని వీ రమ్మివేయఁ దలఁచుచున్నారు. ఈ యుత్తమర్ణు లెంతకఠినులు!

ఆ. వె. పడవుకూడుకంటె ♦ వడ్డిన త్తరకమే ని
షిద్ధ జీవనమని ♦ చెప్పవచ్చు;

వేశ్య యిచ్చకముల ♦ వెల కష్మ్యంబుచుండు
బాధపెట్టు పడ్డి ♦ వర్తకుండు.

జం — ఎవరో దయ్యములాగు వచ్చి మమ్ము నిందించుచున్నది.

వీరి — ఇంకెవరు? చంచల!

జం — చంచలయా! ఇక్కడ కెందుకు వచ్చినది?

(అని తొందరపడును)

చం — ఓహో! ఈ నవటలా?

ఆ. వె. ఇంట నెంతధనము ♦ నీల్గుచు నుంచిన
గడ్డితింద్రు కాసు ♦ వడ్డికొఱకు
కాటియొద్ద నక్క ♦ కైవడి పేదల
శల్యములను గోటికి ♦ చంపుచుంద్రు.

ఈ బడుద్ధాయివాండ్రు నా యింటిచుట్టు తిరిగి నా దయకై యేడ్చిన వాండ్రే. (చీపురు పట్టుకొని) ఓరీ! నరమాంసవిక్రేతలారా! బుద్ధిలేదా? ఋణమునకై నా టిమానవు నమ్మివేయుదురా (అని చీపురుతో బాదును)

జం — నా బ్రాహ్మణ్యము నేటితో మంట గలిసిపోయినది.

వీరి — చంచలా! నన్ను విడిచిపెట్టుము. నన్ను జానిసవర్తకుడని రాజభటుల కప్పగింపకుము. నీకు పదివేలు సమర్పించుకొందును (అని యిచ్చిపోవును).

జం — ఇంతకు దురాశచే గక్కురితిపడినందుకు మంచిశాస్తి జరిగి నది. (ప్రక్కను జూచి) ఇదిగో యెవరో సన్యాసి వచ్చుచున్నాడు. నేను పోయెదను. (నిష్క్రమించును)

గుణదత్తుడు — (ప్రవేశించి, స్వ) నేను సన్యాసినిగాను గుణదత్తుడను. నా జీవితనాటకమున కిది చతుర్థ రంగము. దీనితో నా కథ ముగిసి పోవును. (తిరిగి చూచి) ఓహో! మహామాయావిదైన చంచల యిక్కడనే యున్నది.

చంచ — సోమపాదా! నీవు నా శిష్యుఁడవై పోయినావు. కావున నా యింటికి వచ్చి నా యాజ్ఞానుసారము ప్రవర్తించుము.

గుణ — (స్వ) ఉన్న నేమి? నన్నెవరు పోల్చుకొనఁగలరు. కళను కీర్తి యుంచి కొన్నైన సంపాదింపలేక పోయినాను కాని బాసిసవర్తకుఁడను పేరు వచ్చినది. నన్ను ప్రభుత్వమువారు పట్టి బంధించుటకు వెదకుచున్నారు. వారికి చిక్కకుండ నే నీ సన్న్యాసవేషము ధరింపవలసివచ్చినది. సరే ముందేమి కానున్నదో చూడవలెఁగాక!

చంచ — సోమపాదా! నీవు నా యింటికిఁ బోయి వీధికుమ్మము కాచియుండుము. నేటినుండి నీవు శరుఁడని పిలువఁబడవలయును.

సోమ — సరే. (స్వ) ఇదంతయు నా కర్మసూత్రముగాక వేరే మున్నది?

చ. బ్రతుకున కెన్నొ యిక్కటులు ♦ వచ్చును గల్గునులోటు లెన్నొ; సం
స్మృతిఁ గడతేఱువార లొక ♦ రేనియు నుండరు; గాని నావలెన్
వెతల మునింగి ప్రేయసిని ♦ వీడి కటా పొరిగింటిదాస్య జీ
వితమున కొప్పరెవ్వరు భు ♦ విన్ మనుబోంట్లకుఁ జావు లేవొకో.

గుణ — ఎటులైన నీ చంచలను వంచింపవలయును. దీనియొద్ద లెక్క లేనన్ని ధనరాసు లున్నవి. ఆ మహాధన మంతయు వంచనచేసి సంపాదించినదే కాని దీని కావంతయు ధనాశ పోలేదు. ధనాశా! ధనాశ యీ కులట కుండునన్న లెక్కేమి.

శా. ఆశాబద్ధము లోకజాలము జడ ♦ త్వావేశవిస్ఫూర్తి చే
క్లేశంబందునొ యంటియుండును మను ♦ ష్యుల్ బ్రహ్మవిద్వర్యులే
యాశన్ బాయఁగలే రటన్నను హిర ♦ ణ్యంబన్న సామాన్యలో
పాశంకన్ దలఁపోయరా దిదె సుమీ ♦ ప్రాణంబు నీక్షోణికిన్.

చంచ — (సమీపించి) ఎవరీసన్న్యాసి. మహానుభావునివలె నున్నాఁడే.

గుణ — అగును. నేను మహానుభావుఁడనే.

చంచ — స్వామీ నమస్కారములు. (స్వ) (ఈతడెవరో దొంగవలె నున్నాడు).

గుణ — నీ వెవ్వతెవు?

చంచ — నేనీ పురపు వేశ్యను. నా పేరు చంచల.

గుణ — నీవు సత్యమార్గమునకు రాఁ బ్రయత్నింపుము.

చంచ — నీవే నాకు సత్యమార్గము కావలెను.

గుణ — నీ యందు మా కట్టి ప్రేమ కలదు.

చంచ — అట్లైన నే నెంతయు ధన్య నయ్యెదను.

గుణ — సరే! నాకు చాల ఆకలి యగుచున్నది. చేరెడుపాలు గొనిరాఁగలవా?

చంచ — మీకు కావలసినన్ని తెచ్చి యిచ్చెదను.

(అని వెడలిపోవును)

గుణ — దీని కాశ మెండు. ఈ యాశలోనే దీనిని నాశనము సేయ వలయును. చాలమంది యాశాబద్ధులు వేదాంతము నేర్చుకొనుచు మనుముసుఁగులో మనోరథము లాకాశవీథుల కెగయఁ బఱవెత్తు చుందురు. సరే! నా కక్షపాలములో నున్న బంగారుతీఁగ లీ మట్టి యాడలలో గ్రుచ్చి యుంచి చంచలకు మోహము చేయుదునను నమ్మకము పుట్టించెదఁగాక. ఇది యన్ని వేదాంతములకన్నను పై మీఱి పోయిన వశ్యౌషధము.

చంచల — (ప్రవేశించి, కళ నెత్తిపై తినుబండారములు పెట్టి తెచ్చి దింపి) స్వామీ! యీ భక్ష్యము లారగించి నన్నాశీర్వదించి నా కేమైన వేదాంతరహస్యము లెఱింగించి నా జన్మ తరింపఁజేయుఁడు.

గుణ — సరే! చంచలా! నీవు మిగుల యోగ్యురాలవు! నీవు చేసిన సేవాపరాయణతకు మే మెంతయు సంతసించితిమి. చూడుము - ఈ వట వృక్షపు ఊడలు త్రెంపి తెమ్ము.

చంచ — (తెచ్చును.)

గుణ—వానిపై నా కమండలూదకము చల్లి సమిధలలో పెట్టి కాల్చి వేయుము.

చంచ — (అట్లు చేయును.)

గుణ — ఆబూడిద నా కమండలూదకమునఁ గడిగి తీసికొనిపొమ్ము.

చంచ — (బూడిద కడుగ బంగారుతీఁగలు చేతికి వచ్చును. అవి తీసి చూచి) ఆహా! యేమి యీ యోగిమహామహిమ. క్షణములో నీ మట్టియూడలన్నియు బంగారుతీఁగలై పోయినవి. (అని కాళ్ళపైఁబడి) సామి, మీరు సాక్షాదీశ్వరుఁడు, గాని వేరుగాదు. (స్వ) ఈతఁడు గుణదత్తుఁడు. నన్ను తిరిగి మాయచేయ వచ్చినాఁడు. పేదరిక మెన్ని యనర్థములకైన దారితీయును. ఇంక నీతనికి నా నిజరూపమును చూపి క్రమపద్ధతులఁ బ్రతుకింౘెదను (ప్ర) స్వామి!

ఆ. పుట్లకొలఁది హేమ ♦ పుంజంబు లుండిన
హేమవిద్యయున్న ♦ ఋషిపదాబ్జ
రజముకైన పనికి ♦ రావు; రారాజు లా
యోగి కాళ్ళక్రింద ♦ నుండువారె.

స్వామీ! నా మందిరమునకు వచ్చి నన్ను పవిత్రను జేయ వేఁడుచున్నాను.

గుణ — మాకు మీ వంటివారితో నేమిపని?

చంచ — నాకు మీరు వేదాంతము నేర్పుదుమన్నారు గాదా (అని కోరచూపులు చూచును).

గుణ — అగును. నా యాశ్రయమునకు రమ్ము.

చంచ — నా యిల్లు మీ ఆశ్రమముగాదా?

గుణ — (స్వ) ఈమె నా వలలోఁ బడిపోయినది. కాని నేను దీని

యింటికి వెళ్ళిన నా గుట్టు బయలుపడక పోదు. కావున దీని నెచ్చటి కైన తీసుకొనిపోయి దీని యాస్తి యంతయు వ్రాయించుకొనవలెఁగాక. అప్పుడుగాని నా శ్రమలు తీరవు (ప్ర) చంచలా! నీ కిష్టమైన నా వెంట రమ్మా. లేదా నేను వెళ్ళిపోయెదను.

చంచ — స్వామీ! మీరు పోవలదు. నేను మీవెన్నంటి వచ్చెదను. (స్వ) సమయము దాఁటితే నా కితఁడు చిక్కఁడు. ఎప్పటికైన భర్త తోడిదే లోకము.

గుణ — (స్వ) ఈ చంచల ధన మెట్లో దక్కించుకోవలయును.

చంచ — శరా! నీవు నా పుత్రి యీశ్వరిని పెండ్లి యాడవలయును.

శరు — (స్వ) నా కళ యుండఁగా నే నీ వేశ్యాపుత్రి యీశ్వరిని పెండ్లియాడుటెట్లు? అయ్యో! నేనీ జన్మమున నిట్టి యకార్యాచరణము నీ ప్రాణముండఁగఁ జేయగలనా? ఎప్పటికైన నెన్నిజన్మలకైన నా కళే నాకు కావలెను. (ప్ర) అమ్మా! నాకుఁ బెండ్లియేమిటి? నేనే బానిసను. ఆ మహనీయమునకు ఈశ్వరి —

చంచ — నీవు మారుమాటాడవలదు. నా ఆన —

శరు — అయ్యో! పలికమాట యెట్లు దాఁటనగును?

చంచ — ఈశ్వరీ! నేను వేదాంతము నేర్చుకొనుటకు దేశాంతరము లకు పోఁబోవుచున్నాను. కావున నా భాగ్య మంతయు నీవు జాగ్రత చేయుము. ఈ శరుని పెండ్లియాడి నాయానఁ జెల్లింపుము.

కళ — (స్వ) హా! హతోస్మి! నేను కులకాంతను. ఈ యన్యపురుషు నెట్లు వరింపఁగలను. (అని నేల పడిపోవును).

సోమ — ఏమి యీ వైచిత్ర్యము. కుమ్మరావములో నిత్తడిముంత లనినట్లు కులటయింట కులకాంతయా? యిది కడుంగడుచిత్రముగనున్నది.

చంచ — ఈశ్వరీ! యిది నీకు తప్పదు. ఇదే నేను వెళ్ళిపోవు చున్నాను. నా యాన చెల్లింపుము.

(చంచల గుణదత్తుఁడు నిష్క్రమింతురు)

సోమ — ఈశ్వరీ! నీకీ పంచమ ప్రవృత్తి కల్గెనా? నీకు సతీత్వమేమైనది?

కళ — ఓరీ! బహుభాషీ! నోరు కట్టుము. నేను మగవాలిని. నా జోలికి వచ్చితివా ఇదిగో కత్తి. (అని చూపును).

సోమ — ఇది మిగుల చిత్రముగ నున్నది.

కళ — ఓ యీశ్వరా!

ఉ. ఓ జగదీశ్వరా! పరమ ♦ పావనతేజ! చరాచరైకవి
భ్రాజిత, సర్వలోకజన ♦ వందిత నీమ సనంతరూపమే
యోజ నెఱుంగరాని దయి ♦ యున్నను నాపదలందు నీవు రా
రాజులకెన్న మేటివగు ♦ రాజిలి బ్రోచెదు; నిన్ను మ్రొక్కెదన్.

స్వామీ! నా మానము కాపాడుము! లేదా నా ప్రాణమైన దీసివేయుము.

సోమ — ఈశ్వరీ! యిట్టి వీరమహాపతివ్రతవు వేశ్యయింట నెట్లు కాపురమున్నావు?

కళ — అది నా కర్మసూత్రము.

తే. గీ. రావణునివిడెఁ లేదె సీ ♦ తావధూటి
నరకునింటను రాజక ♦ న్యకలు లేరె
అట్లు లీ వేశ్యయింట నే ♦ నలరవలసె
విధివిధానము మారెడు ♦ విధము గలదె!

సోమ — ఈశ్వరీ! నీ చరిత్రము మిగుల విచిత్రముగ నున్నది. నా మన వాలకించి నీ తలపై ముసుఁగొకసారి తీసి యీ బ్రహ్మాండ పరిభ్రాంతమహామహిమాస్వరూప మొకసారి సాక్షాత్కరించుకొనుము. ఆ విశ్వమూర్తి నొకసారి ప్రేమగానమున గాఢాలింగన మొసరించి నీ నిజరూప మహాతేజోవిరాజిత దివ్యదర్శనమును గావించు

కొని కృతార్థవు కమ్ము. లెమ్ము. ఏల ఈ నేలఁబడి పొర్లాడెదవు. (అని చేతిని చేయి కలిపి లేపును).

కళ — (లేచి) ఓరీ! శతాత్మా? పాపీ! నాకరగ్రహణమున నాశరీరము మిగుల కళంకభూయిష్ఠముగఁ జేసివైచితివి. అయ్యో! నిరపరాధిని నగు నన్నేల ముట్టుకొంటివి. నాభర్త నన్ను బాసినదిమొదలు నేనీ యొంటి వలువతో కంటికి మంటి కేకధారగా నేడ్చుచు కాలము బుచ్చునాకింకను మరణము రాలేదని వేచియున్నాను. దోషదూషితులైన మీవంటివారి వదనజ్వాలావాలిక లవలోకించుటకు మాబోటి ఖిన్నహృదయుల కేమి పని. కావున నీ విచ్చటినుండి వెడలిపొమ్ము. దూరముగా పొమ్ము. నేను నా ముసుగు తీయను. నా యెదుటనుండి లేచిపొమ్ము. (అని కత్తిఁ జూపును).

సోమ — ఓహో! యిది కేవలము కళాస్వరూపము.

(చంచల, గుణదత్తుఁడు ప్రవేశింతురు)

గుణ — నీ కేమి కావలయును?

చంచ — నీయొద్ద గల హేమవిద్య చెప్పివేయుము.

గుణ — తప్పక. ఈవిద్య నీదే. నీవు నాదేవివి. నా అంకముపైఁ గూర్చుండి నాకు నీ ప్రేమాస్పదమైన ముద్దుపలుకులతో నాలింగనము గావించుము.

చంచ — అయ్యో! ఇది యేమిసన్యాసము!

గుణ — వేశ్యలయొద్ద సన్యాసులు పరసు లగుచుందురు.

చంచ — అది నావల్లకాదు.

గుణ — నీవు వ్యభిచారిణివి కావా?

చంచ — నీ సన్యాస మెట్టిదో నావేశ్యత్వ మట్టిదే.

గుణ — అగఁగా?

చంచ — అనగానా! నీవు సన్యాసివై అగపడినను మనసునం దా వైరాగ్యము లేదు. నేను వేశ్యనై అగపడినను నామనసునం దారాగ లేశము లేదు.

గుణ — నీవు వేశ్యావృత్తి సేయలేదా?

చంచ — చేసితిని.

గుణ — ఇంకేమి?

చంచ — వేశ్యావృత్తి చేసితిని గాని వ్యభిచరింపలేదు.

గుణ — అది యెట్లు?

చంచ —

తే. గీ. జగమునకు రెండు ద్వారాలు ♦ నెగడుచుండు
పాప పుణ్యాల సూత్రాలు ♦ పట్టుకొనఁగ
నెవనికి విశుద్ధత గలదో ♦ యెవనియందు
మచ్చ లున్నవో వానికే ♦ స్వచ్ఛ మదియు.

ఆ. వె. అగ్ని మ్రింగవచ్చు ♦ హాలాహలము గొంతు
బంటి దాచి బ్రతుక ♦ వచ్చుఁగాని
ధర్మఁ బతివ్రతలను ♦ దాఁకి జీవింపఁగాఁ
గలరె మిడుత దీప ♦ కళికఁబోలె.

చంచ — (గుణదత్తుని కాళ్ళపైఁ దలయుంచి) స్వామి! నేనుసర్వ సంగపరిత్యాగినై నీవే సర్వమని నీ సన్నిధిఁ జేరినాను. నన్నిక నీవు నీళ్ళ ముంచినను పాల ముంచినను నీదే భారము. నీసేవ, నీధ్యానము తప్ప నాకు వేరుచింత లేదు. వేరుశరణ్యము లేదు. రక్షింపుము.

(రాజభటులు ప్రవేశింతురు)

రాజభటులు — ఏడీ గుణదత్తుఁడు?

ఒకభటుఁడు — అడుగో.

మరియొక భటుఁడు — సన్న్యాసివేషము వేసికొని మాయచేయుట కేవో యుపాయాంతరములు పన్నుచున్నాఁడు.

మొదటిభటుఁడు — ఆహా! ఏమి.

రెండవభటుఁడు — (జుట్టు పట్టుకొనును).

చంచ — (లేచి) ఇది యేమి ఘోరము. నా గురుమహాశీయు నేల పరాభవించెదరు?

మొదటిభటుఁడు — ఈతఁడు నీకు గురువా? నీ వెట్లు వేదాంతినివో యీతఁ డట్టిదొంగలకు గురువు.

చంచ — ఆహా! ఏమి యీ దారుణము!

రాజ — ఓరీ! గుణదత్తా! పలుక వేమి?

చంచ — ఏమి? యీతఁడు గుణదత్తుఁడా?

రాజ — మ రెవరనుకొన్నావు!

రాజ — ఈ గుణదత్తుడు స్త్రీల దొంగిలించి కానిసవర్తకము చేయుచున్నాఁడను నేరము మోపి ప్రభుత్వము బంధింపఁదలచినారు. ఎవ్వరైన నీతని సద్వర్తనమునకుఁ బూచీ పడునెడల నీతని విడిచిపెట్టెదము.

చంచ — బాబూ! ఈ దుర్మార్గున కెవరును నీ ప్రపంచములోఁ బూచీపడరు. పడినను వారల నట్టేట ముంచివేయ సమకట్టును. కావున వెంటనే వీనిని చెరసాలలో బంధించి బుద్ధిచెప్పుఁడు. మీకు పదివేల నమస్కారములు.

గుణ — ఆహా! ఎట్టి దృశ్యములు చూచుచున్నాను. ఇంక నే నీ ధర్మప్రపంచమున నొక్క మట్టికణమును గూడ కాను కాబోలును.

(గురువు ప్రవేశించును)

హా! గురుమహాశయా! నన్ను కాపాడుము. నీయెడ నేనేయపరాధము చేసినాను. నా తప్పులు మన్నించి నా కిప్పుడే సాక్షాత్కరించి నన్నీ యాపదలనుండి కాపాడుము. తండ్రీ! కాపాడుము.

చం. జడుఁడ నిరీశ్వరుండ నయి ♦ జారుల చోరులతోడఁ గూఁడి యే
ర్పడ నపరాధముల్ సలిపి ♦ పాపములన్ వడిగట్టుకొంటి నీ
కడకు ఫలంబు గల్గినది ♦ గాదు నిజంబుగ సత్ప్రవర్తనల్
విడువనివారె బాగుపడి ♦ విశ్రుతి గాంచిర నాఁడు నాటికిన్.

గురువు — పుత్రా! భయపడకుము. నీవు పశ్చాత్తాపమున తిరిగి పవిత్రుఁడవు కాఁగలవు. రాజభటులారా! గుణదత్తుని విడిచివేయుఁడు.

(విడిచివేయుదురు)

గుణ — గురువర్యా! నమస్కారశతములు.

(అని కాళ్ళపైఁ బడును)

చంచ — స్వామి! నేనపరాధిని గాను.

గురు — అగును. నీ నాథుని నీవు తిరిగి స్వీకరింపుము.

గుణ — ఈమె నాథుఁ డెవరు?

గురు — నీవే.

గుణ — (చకితుఁడై నేలఁ బడిపోవును.)

చంచల — (లేపి నమస్కరించి) నీకు నేను నేటినుండి దాసిని. (అని మోముపైగల ముసుఁగు తీసి) ఈశ్వరీ! నీ ముసుఁగుఁ దీయుము.

కళ — (ముసుఁగు తీయును.)

చంచ — ఈమె కళ.

గురు — సోమపాదా! నీ వీమె నేలుకొనుము.

సోమ — ఈమె నా కళ. ధన్యోస్మి (అని కౌఁగిలించుకొనును)

గుణ — జయా! నీకే జయము - నిన్ను చావుమని తిట్టితిని. ఆ స్థితి నాకే పట్టినది.

(భవుఁడు అభవుఁడు ప్రవేశింతురు)

భవుఁడు — గురువర్యా! నమస్కారశతములు. మీ శిష్యుల నెందఱినో పరీక్షించి విమర్శించి వెన్నాడి వారి పవిత్ర మహాధర్మ ప్రతిపాదకమైన శీలము, జ్ఞానసాధనసంపత్తి, దేవలోకమే గాక తలాతల రసాతలములలోఁ గూడ చాటించి వెల్లడించినారము. మమ్ము మీ శిష్యకోటిలోఁ జేర్చుకొనుఁడు స్వామీ!

గురు — తథాస్తు.

అభవు — సోమపాదా! మహాపతివ్రత యగు కళా! మీ కిప్పుడు మేము సోదరులము. ఇదిగో! ఈ యక్షయమగు ధనము పారితోషికముగాఁ గైకొనుఁడు. గుణదత్తుఁడా! నీవు సన్మార్గగామి వైతివి గావున, ఇదిగో! యీ నిక్షేపమును గైకొని సుఖ ముండుము.

## భరతవాక్యము

### తేటగీతి

శాంతశమదమాదిక శుభా ♦ నంత సుగుణ
గణములను గల్గి జ్ఞాన సా ♦ ధనము నేయు
ధర్మవిదులతో దేశంబు ♦ దనరుఁగాత
యైహికాముష్మిక సుఖంబు ♦ లగునుగాత!

సంపూర్ణము.